

## రామాయణములో

# దశరథుని కోడళ్ళు

## మైథిలి - ఊర్మిళ - శ్రుతకీర్తి - మాండవి



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

అంతర్జాల మాధ్యమం

www.pravachanam.com



రామాయణములో

# దశరథుని కోడళ్ళు

## మైథిలి - ఊర్మిళ - శ్రుతకీర్తి - మాండవి

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామి వారి

మంగళాశాసనములతో




పరిష్కర్త

**శ్రీ మొలుగు రంగాచార్యులు**


భాగవత కైంకర్యం

**శ్రీమతి కొమాండూరి సీతాలక్ష్మిగారు, తిరుపతి**

# రామాయణములో దశరథుని కోడళ్ళు

శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

© రచయిత్రి

ప్రథమ ముద్రణ

**ఫిబ్రవరి, 2001**

శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు, శ్రీమతి విజయలక్ష్మి దంపతులు

డిజిటల్ వెర్షన్

**జనవరి, 2021**

శ్రీమతి కొమాండూరి సీతాలక్ష్మిగారు, తిరుపతి

వెల

**అమూల్యం**

సంప్రదించుటకు

శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి. రాఘవాచార్యులు

9490942884

# వినతి

రామాయణము వంటి కావ్యములలో నాయికా నాయకులకు ప్రాధాన్యత నిచ్చుచుంట చేత నితర పాత్రల గొప్పతనము మరుగున పడిపోవుచుండును. ఈ విషయము నే నాంధ్ర వచన రామాయణము రచించునాడే నా మనసులోనికి వచ్చినది. ఐనను ఆ వెనువెంటనే సన్మార్గ దర్శనము, రామానుజ చరిత్రలు వ్రాయుటచేత వానిని గురించి లోతుగా నాలొచించు అవకాశము కలుగ లేదు. రామాయణము లెన్నో కలవు. వాటిని వ్రాసిన వారెందరెందరో కొన్ని రామాయణ ఘట్టములందీ యుపపాత్రలకు ప్రాధాన్యత నిచ్చియున్నను నవి యుపపాత్రలు గానే ఉన్నవి.

ఇటువంటి యుపపాత్రల మనో విశ్లేషణముతో కొందరు ఖండ కావ్యములు రచించియున్నారు. వారి వారి రచనలలో నీ పాత్రలే నాయికలుగా, నాయకులుగా నున్నారు. ఉపపాత్రలుగా నున్నప్పుడివియే ప్రధాన కథకు పుష్టిని, తేజస్సును కూర్చియున్నవి. వీటి ద్వారానే ప్రధాన పాత్రల మహత్తు, అవతార రహస్యములు, వెల్లడి కావలసియున్నది.

రామయణములోని ఉపపాత్రల మనోవిశ్లేషణతో ఖండకావ్యములు వ్రాసిన వారిలో శ్రీమాన్ గుదిమెళ్ల రామానుజాచార్యుల వారొకరు. వీరు కవిరత్న బిరుదాంకితులు. జీయరుస్వామి వారితో దేశపర్యటన జేసి రామాయణ గానము జేసినవారు. వీరి రచనలు నా మనసున కెక్కుటచేత వీనిననేక పలుమారులు మననము చేసితిని. ఇవి యన్నియు పద్య కావ్యములు.

పద్యములను చదివి యర్థము జేసుకొనలేని వారికై రామాయణమును వచనములో వ్రాసిన నాకు, ఖండ కావ్యములను కూడ వచనముగా వ్రాయవలెనను కోరిక కలిగినది. కవిరత్నగారి ఖండకావ్యములలో మైథిలి, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తులను నాలుగు ఖండ కావ్యములను వచనమున వ్రాయుటకు పూనుకొన్నాను. ఇవి కవిగారి కృతులకు అనువాదములు కావు. స్వేచ్ఛానుసరణలు మాత్రమే. రామాయణములోని సీతాస్వయంవర కథతో 'మైథిలి' వ్రాయడమైనది. లక్ష్మణుడడవికి వెళ్లుటకై ఊర్మిళ యనుమతి పొందు ఘట్టము 'ఊర్మిళ కై ఎన్నుకొనబడినది. శత్రుఘ్నుడు మంథరను శిక్షించు సందర్భము 'శ్రుతకీర్తి'కి గ్రహించబడినది. అరణ్యవాసము ముగియుటకు ముందు భరతుని విషాదమును 'మాండవి'కి గ్రహించబడినది. ఈ నలుగురు దశరథుని కోడళ్ళనే కాక, వారి భర్తలను, రామాయణ రహస్యములు, అవతార ప్రయోజనములు తమతమ సహజ ధోరణి ప్రధాన పాత్రల మనోవిశ్లేషణ ప్రవచనము చేయుట ఇందలి ప్రయోజనము.

కవిరత్న శ్రీమాన్ రామానుజాచార్యులవారి ఇటీవల పునర్ముద్రితాలు కొన్ని గ్రంథములను ఉచితముగా బంపి నాయీ రచనకు తోడ్పడిన మా గుదిమెళ్ళ బదరీనాథ్ గారికి ఆశీస్సులు.

కథా గమనమును బట్టి వరుస క్రమము నిర్ణయించినందున నివి మైథిలి. ఊర్మిళ, శ్రుతకీర్తి, మాండవి యనుక్రమములో వ్రాసి అన్నిటిని కలిపి యొకే పుస్తకముగా కూర్చితిని. పాఠశాల విద్య నెరుగని నాచే నీ రచన చేయించిన వారా నల్వురు దశరథుని కోడళ్లే.

కోడళ్ళలో మొదటిది, రామాయణము సీతాచరిత్రమే యనిపించు కొనినది మైథిలియే. అయినను సర్వవిధముల కోడళ్లలో నగ్రగణ్య యైనందున నామెయే మొదట నిలిచినది. మిగిలిన మూడును రామాయణములో లఘు పాత్రలు మాత్రమే.

పాండిత్యము లేని నాకు అవగాహన చేసుకొనుటలోను, భావమును వ్యక్తీకరించుటలోను, భాషలోను శక్తి చాలదను విషయము తెలిసినదే. సహృదయముతో నిందలి మంచిని మాత్రము గ్రహించి దోషములను వదలి వేయుడని పాఠకులకు విన్నవించుకొనుచున్నాను.

నాచే నీ స్వేచ్ఛానుసరణము చేయించిన దశరథుని కోడళ్లు మైథిలి, ఊర్మిళ, శ్రుతకీర్తి, మాండవి - లకు నమోవాకములు. నా పతిదేవులు శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లంగారి పాదపద్మ ! ములకు దాసోహములు.

ఈ రచనను సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర ప్రభువుల వారి పద సన్నిధిని సమర్పించు..


భాగవతపదదాసి

**శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**శ్రీ లక్ష్మీనృసింహ భవనము**

అయ్యవారి రుద్రవరము మండవల్లి మండలము

కృష్ణాజిల్లా

ఫోన్ : 08677-88261




శ్రీమద్రామాయణమును ఆంధ్ర వాల్మీకి ననుసరించి తేట తెనుగు వచనములోనికి అనువదించి పాఠకలోకమునకు, ముముక్షు జనానీకమునకు ప్రసాదించుటేకాక 'రామానుజ చరిత్రను' వ్రాసి విశిష్టాద్వైత ప్రభను వెల్లడించిన వారు శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఒక మారు రామాయణ సుధాపానము చేసినవారు మరల మరల నా మాధుర్యము ననుభవింపక నుండజాలరు. సీతాచరితమైన రామాయణములో నామె చెల్లెండ్రేకాక తోడికోడళ్లును అగు ఊర్మిళ, శృతకీర్తి, మాండవిల విలక్షణమైన వ్యక్తిత్వములు రామాయణమున ప్రకాశింపవు. కావున లఘు కావ్యరచనల ఆవశ్యకత యేర్పడగా కవిరత్న శ్రీమాన్ గుదిమెళ్ల రామనుజాచార్యుల వారాకొరత పూరించి, వానిని తెనుగున పద్య కావ్యములుగా రచియించిరి. శ్రీమతి వెంకట సీతమ్మగారు దశరథుని నలుగురు కోడళ్ల పేరున వెలసిన ఆ నాలుగు లఘు కావ్యములను అనుసరించి తెనుగు వచనమున నొకే పుస్తకముగా వెలయించిరి దశరథుని కోడళ్లు అను పేరున.

ఆమె రచనలలోని రామానుజ చరిత్ర రామాయణములోని సుందర, బాలకాండలు అచ్చైయుండగా వాటిని పఠించు భాగ్యము మాకు కలిగినది. ఆ పారవశ్యముతో నామె తదుపరి రచన "రామాయణములో దశరథుని కోడళ్లు" చదువు నవకాశము మాతోబాటు ముముక్షువులైన పాఠకలోకమునకు కలిగించు సంకల్పము మాకు కలిగినది.

శ్రీమతి వెంకట సీతమ్మగారి రచనలలో రామానుజ చరిత్రను, (రామాయణ మందలి), బాలకాండను ఆమె తృతీయ పుత్రుడు వెంకట నరసింహాచార్యులు, వాని భార్య లీల అచ్చువేయించి యుండగా, సుందరకాండను జ్యేష్ట పుత్రుడు రాధాకృష్ణమాచార్యులు, వాని భార్య భూదేవియు అచ్చొత్తించిరి. రెండవ కుమారుడు వెంకటేశ్వర్లు, వాని భార్య లక్ష్మి ప్రోత్సహించిరి. నాల్గవ పుత్రుడు శ్రీమన్నారాయణ, వాని భార్య సీత, మనుమలు నామె సేవచేయుచు రచనానుకూల వాతావరణము నిర్మించుచున్నారు.

రచయిత్రి పెద్దకుమార్తె సుగుణ, ఆమె భర్త మొలుగు రాఘవాచార్యులును; రెండవ కుమార్తె రమాదేవి, ఆమె భర్త మొలుగు రంగనాథాచార్యులును ఆమోదము, ప్రోత్సాహమును కలిగించగా 'దశరథుని కోడళ్లు' అచ్చొత్తించు కార్యమునకు మూడవ అల్లుడనైన నేను, నా భార్య విజయలక్ష్మియు సంకల్పించితిమి. ఈ సంకల్పము పరమపద నివాసులైన మా తండ్రిగారును, ప్రముఖ వ్యాకరణ పండితులునగు శ్రీమాన్ కరి రామానుజాచార్యుల వారు మాకు ప్రసాదించిన సంప్రదాయాభిలాష మరియు సంస్కారముల ఫలముగా ప్రాప్తించినది.

ఈ రచనను అచ్చొత్తించు భాగ్యమును మాకు ప్రసాదించిన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారికివే మా నమోవాకములు. పఠించువారందరికి దశరథుని నలుగురు కోడళ్లును సర్వశ్రేయములు ప్రసాదింతురుగాక!


**కరి రాధానాథాచార్యులు**

**విజయలక్ష్మి**

15-2-2001

"రామానుజ కుటీర్"

45-58-8, నరసింహనగర్

విశాఖపట్నము - 530 024

ఫోన్ : 536912

# ముందుమాట

సీత రామాయణ కథానాయిక. సీతా మాహాత్మ్యము గురించి రామాయణమున నన్ని కాండలలోని అన్ని పాత్రలును వక్కాణించును. ఈ గ్రంథమున సీతాకళ్యాణ ఘట్టము గ్రహించి, ఆమె యవతార ప్రయోజనమును, జనకుల పుణ్య చరిత్రయు, కౌశికుని పురుషకారమును వెల్లడించిరి. ఇందు సీత బాల్యమందలి ముగ్ధత్వము మాత్రమే కనిపించును.

ఊర్మిళ లక్ష్మణుని భార్య. వివాహ సందర్భమున, లక్ష్మణుడడవులకు రాముని వెంట వెళ్లుట కామె యామోదము పొందు సందర్భమున మాత్రమే ఆమె ప్రస్తావన రామాయణమున వచ్చును. ఈ రచనలో లక్ష్మణుడామె యామోదము పొందు సందర్భము గ్రహించి, ఆమె విలక్షణ వ్యక్తిత్వము ప్రకాశింపజేసిరి. ఆమె ప్రాగల్భ్యము భర్త పాదచ్ఛాయలలోనే పయనించును. ఆమె ఆక్షేపింపగలదు. యధార్థము గుర్తింపగలదు. ప్రోత్సహింపగలదు, ఉపదేశింపగలదు. స్వసుఖ త్యాగము చేయగలదు. వ్యాజనిందలో నామెదిట్ట. ఆమె భగవత్సేవయే కాదు, భాగవత సేవయు మానసిక నివేదనగా చేయగలదు. చివరకు సంతృప్తితో భర్త మార్గము ననుసరించును.

కోడళ్లు నల్వురిలో శ్రుతకీర్తిలో ప్రాగల్భ్యము మిక్కిలి ప్రకాశించును. మిగిలిన ముప్వురికంటె నీమె స్వాధీన భర్తృక, భర్త నదలించగలదు. అధిక్షేపించగలదు, తన దారికి తెచ్చుకొనగలదు. కోడళ్ళందరిలో నీమె అదృష్టవంతురాలు మాత్రమే

కాదు సుఖవంతురాలును, మంత్రిత్వమునుమించి, యుపదేశికత్వము వహించును ఏనాడును భర్తృ వియోగము నెరుగనిది. దీనికీమె భర్త భగవత్పరతంత్రుడు భాగవత పరతంత్రుడగుట కారణము కావచ్చును.

మాండవి భర్తకు స్వాధీనయైయుండి భర్త కెప్పుడేమి తోచునో యెరుగక సంకటపడునది. సీత, ఊర్మిళలవలె భర్తయెడబాటు నెరుగకున్నను, భర్త యొద్దనే వైరాగ్యము పాటించుచు నుండునది. భగవద్భక్తి భాగవత సేవయు నీమెకు భూషణములు. ఉద్ధతుడగు ప్రాణపతికి అతడు గుర్తింపకుండునట్లు మంత్రాలోచనము నందింపగలదు.

ఒక చిన్న ఘట్టమునో, సందర్భమునో గ్రహించి పాత్రల మనస్తత్వ చిత్రణ చేయుట సామాన్యము కాదు. మూలముననువదింపక అనుసరించి రచన చేయుట కష్టసాధ్యము. అయినను ఈ రచనలో పరిణతి ఎల్లెడల కానుపించును.

ఈ పుస్తకము సహృదయ పాఠకులను రంజింపజేసి దశరథుని కోడళ్లు నలుగురిని గురించి ఆలోచింపజేసి వారి ఔదార్య, సౌశీల్యాది గుణములను గ్రహింపజేయు ననునది నిర్వివాదాంశము.

15-2-2001 **మొలుగు రంగాచార్యులు**

"శ్రీనివాస నిలయము"
యన్.జి.ఓ. కాలనీ
తణుకు.

# మైథిలి

అదిగో! ఆ కానవచ్చునదే మిథిలా నగరము. అదే యజ్ఞ వాటిక. అందులో ముని సమూహమదే. అతడే జనకుడు. ఆ కర్మయోగి సపరివారమిటే వచ్చుచున్నారు. ఇటు నుండి ముని ముఖ్యుడు, కుశిక వంశము వాడునైన విశ్వామిత్రుడు వచ్చుచున్నాడు. వాని వెంట ధనుర్ధారులైన రామలక్ష్మణులు, వారితో వైశ్వామిత్ర అఘమర్షణాదులైన ముని శ్రేష్ఠులు, వారి శిష్య ప్రశిష్యులు వచ్చుచున్నారు. ఆ వెనుక యజ్ఞ సంబారములు, అగ్నిహోత్రములు బండ్లపై వచ్చుచున్నవి. ఆ బండ్ల వెంట దూడలతో కూడ గోవులు వచ్చుచున్నవి. ఇట్లు విశ్వామిత్రుని యాశ్రమమే నడచి యిటు వచ్చుచున్నట్లున్నది. జనకుడు వీరిని స్వాగతించు కొరకే వచ్చుచున్నాడు.

జనకుని యజ్ఞశాలలోని వందలాది ఋత్వికులు స్వాగతము పలుకుచున్నారు. జనకుని పురోహితుడు గౌతమాహల్యల పుత్రుడునైన శతానందుడు అతిథులకు అర్ఘ్యము, పాద్యము సమర్పించినాడు. ఆత్మవంతులు పురుష సూక్తము పఠించుచు ముందు భాగమున నిలచియున్నారు. చంద్రముఖులైన దాసీజనము మార్గమంతట పూలు జల్లుచున్నారు. జనకుడు నమస్కార ముద్రతో ముందు నడచుచు నతిథులందరిని యజ్ఞశాలకు తోడ్కొని వచ్చెను. వేదికలపై కుశాసనములుంచి మునులనాసీనుల జేసి మధుపర్కము లిచ్చి పూజించెను. కౌశికుని సమీపముననే వైభవము వెల్లడించు రత్నపీఠము లందు రామలక్ష్మణులను కూర్చుండుడనగా వారును ఆసనములపై గూర్చుండిరి.

ఇట్లందరును తగిన గౌరవాదరములు పొంది యానందించియుండగా గాధిజుడైన విశ్వామిత్రుడు శతానందుని దగ్గరకు పిలచి “ఏమయ్యా! శతానందా! క్షేమమే కదా! ఇచటికి వచ్చుదారిలో మీయాశ్రమమే ముందు కనిపించినది. పూజనీయులైన మీ తలిదండ్రుల నొకటిగా జేసి వచ్చితిమి. ఆ యిద్దరు (దంపతులు) నొకే మాటగలవారై కనువిందు జేయుచున్నారు. నీ మనసులో దిగులంతయు దీరినది కదా? ఈ రామలక్ష్మణులు వారికి దంపతీపూజ జేసిరి. వారీ బాలురను దీవించినారు. నీవు జనక పురోహితుడవు. నీవలన నొక పని నెరవేరవలసి యున్నది” అనెను.

జనకుడు ముని ప్రక్కనే వినయముతో నంజలి పట్టి నిలచి “మునిరాజా! తిరుగులేని మీ దయ యిన్నినాళ్లకు కలిగినది. ఏ కారణము లేకయే కాలము కాని కాలములో లభించిన ఫలము వలె లభించినది. ఈనాడెంత సుదినము?” అని ముని పాదములంటి నమస్కరింపబోయెను. మునిశ్రేష్ఠుడైన కౌశికుడు నవ్వులు చిందించు ముఖముతో లేచి జనకుని కౌగలించుకొని ఆసనముపై కూర్చుండబెట్టెను. గంగా ప్రవాహము వంటి తన వాక్ప్రవాహముతో నిట్లనెను. “రాజశ్రేష్ఠా! ఎన్నాళ్లనుండియో నిన్ను జూచు కోరిక యున్నను, ఎప్పటి కప్పుడు తపస్సో? యజ్ఞమో? ధ్యానమో? ఏవేవియో పనులు, తీరినది కాదు. నీవు కర్మయోగివి. వీసమైన ఫలాపేక్షలేక జీవితమును తామరాకుపై నీటి బిందువు వలె నడపింతువు. ఇటువంటి పవిత్ర నిష్ఠ అందరకు తలక్రిందబెట్టి తపస్సు జేసినను లభించునా? భోగములెన్నోయున్నను వానిని నీ మనసులోనికి జేరనీయక యోగమార్గమున నడచు యాత్రికుడవు. స్వగృహము కాలిపోవు చున్నను ఏ వికారమును పొందని విరాగివి. నీ వైరాగ్య జీవనము నిశ్చల బుద్ధి మానవాతీతములు.

‘అయోధ్యలో యజ్ఞము జేసినంతనే దశరథునికి పుత్రులు కలిగినారు. నీవో? యాగము జేయబోగా భూమిలో నొక బాలిక దొరకినది. ఈ విచిత్రము

లన్నియు యాగముల ప్రభావమే. రాజా! వీనిని పరిశీలించగా మీ యిద్దరకు నేదియో మహాయోగమున్నదని అనిపించుచున్నది. నేనొక యాగము జేయ దీక్ష పూనితిని. తాటక పుత్రలు, మదముచే విఱ్ఱవీగు వారునైన మారీచుడు, సుబాహుడు నను రాక్షసులు పైనుండి రక్తమును ధారలుగా నగ్నికుండమున బోయసాగిరి. వారు పంతము వదులరు. యాగము సాగదు. వారిని శపించుటకో? మా మనసొప్పదు. ఏమి చేయుదును? అయోధ్యకు పరుగెత్తి రాక్షస బాధ మాన్పుటకై దాశరథియైన రాముని బంపుమని కోరితిని. ఆ దశరథుడెంతకును 'సరే'యనడు, రాముని పంపడు. చివరకు 'నీవెరుగని రాముని మహత్వము నేనెరుగుదును. ఈ రాముని మానవమాత్రుడను కొనకు'మని చెప్పి యొప్పింప జూచితిని. కాని రాజు సమ్మతించలేదు. చివర కాత్మజ్ఞానియగు వశిష్ఠుడు నచ్చజెప్పిన మీదట తప్పనిసరియై రామలక్ష్మణులను నాతో బంపినాడు.

'దశరథునికి లేకలేక వయసు పైబడిన తరువాత పాపము బిడ్డలు కలిగినారు. రాముడు కంటబడని క్షణమైనను నతడోర్చుకొనలేడు. అట్టి పసివాడు రాముడు. వానిని బంపుట దుఃఖకరమే. ఐనను మముబోలు తాపసుల మాటల యదార్థమును మనసులో దలపవలెను కదా! పది దినములు పంపిన జాలును, రామునకు సంతోషముతో పలుశుభము లీయగలనంటని. అదికాదని, ఇదికాదని విసిగించి, చివరకు వశిష్ఠుడు వేగిర బెట్టిన తరువాత బంపినాడు.

యాగము నిమిత్తమై భూశుద్ధికొరకు దున్నుచుండగా నాగలి చాలున నీకొక యాడుబిడ్డ దొరకెనట కదా! బాగున్నది. ఎంత యదృష్టము పట్టినది! నీవలన మాకును శుభయోగము కలుగనున్నది. రాజా! నా మాటలు నీవు వినుచున్నట్లు లేదు. ఈ బాలురెవరా? యని కదా, చూచుచున్నావు? అదియే, సందేహము లేదు. పెండ్లి యీడు వచ్చిన కన్య యింటనున్న నేతండ్రికైనను ఈ యవస్థ తప్పనిసరియే; ఇది లోకములోనున్నదే. కూతురనగా దాచిబెట్టిన ధనపు మూట. ఆ సొత్తెవనిదో వాడు వచ్చి తన ధనము తాను గ్రహించువరకు నారాటమే.

ఏమియు దోచదు. వ్యథ తప్పదు. గ్రహీత వచ్చి చేయి జాచి తన సొత్తు గ్రహించిననే మనసు శాంతించును.

ఏదియు మనసుకు పట్టనీయక నిస్సంగిగా నుండు యోగివి. విధి నిన్ను పరీక్షించుటకై యీ కూతురును ప్రసాదించెను. ఆమె పెండ్లి విషయమున నశాంతి పొందుచుంటివి. వ్యథ నొందుచున్నావు. అది తెలిసియే వచ్చితిని. ఇక నీ మనోవేదనను వదలుము. ఈ బాలు రెవరని కదా, నీయాలోచన? ఆ విషయము జెప్పెదను. అయోధ్యాపురము ప్రసిద్ధమైనదే కదా? దానిని అజుడు, ఇందుమతుల పుత్రుడు దశరథుడు చక్రవర్తిగా పాలించుచున్నాడు కదా! అతని కెంత యదృష్టము పట్టినది! ఈ లోకములో మీ యిద్దరే అదృష్టవంతులయ్యా! మీ యోగ ప్రభావము నేను గుర్తించితిని.

ఆ దశరథునికి నల్వురు పుత్రులు. వారు గొప్ప యుదార బుద్ధులు. వారిలో కౌసల్యా సుతుడీ రాముడు పెద్దవాడు. వీనికి సుమిత్రా నందనుడీ లక్ష్మణుడు జత. వీరు శేషి శేషుల వలె మెలగుదురు. ఇది యీ రాజపుత్రుల కథ. వీరి వైభవమును వినుము. ముందు నేను, నా వెనుక నీ రాముడు, వాని వెన్నంటి లక్ష్మణుడు సంతోష చిత్తములతో త్రోవ నడచు చుంటిమి. సుంద రాక్షసుని భార్య తాటకయనునది ధూళి జిమ్ముకొనుచు మాపై దుముక వచ్చినది. దానిని నేను, లక్ష్మణుడు జూచుచుండగనే రాముడు వధించినాడు. ఇది సత్యమా? ఈ పసివాడీ పనిజేసెననగా నమ్మదగునా? అంతటి రాక్షసిని జంపియుండనా? అని కదా నీ సందేహము? రామునికీ కార్యమొక లెక్కయా? నీ యింట గల శివధనస్సును కూడ గోట మీటగలడు.

ఈ యిద్దరు నిద్ర, ఆహారము మాని నా యజ్ఞ వాటికా ద్వారము రక్షించుచు తాటకా పుత్రుడు సుబాహుని చంపిరి. మారీచుని దూరముగా సముద్రమున విసరి వేసిరి. ఈ విధముగా నా యాగరక్ష జేసిరి. మహారాజా! ఈ బాలురు మహాశూరులు. నాయొద్ద గల బలాతిబలలను ఆకలి దప్పికల బోగొట్టు

విద్యలనేగాక మిగిలిన యస్త్రములనన్నిటినీ రామునకుపదేశించితిని. కాని ఓ రాజా! నాకు దృప్తి తీరుట లేదు. వీరి నయోధ్య నుండి యింత దూరము నడపించితిని గదా! ఈ ఋణము దీర్చుట యెట్లు?

'మిథిలాధిపతీ! నేను తలబెట్టిన యాగము నిర్విఘ్నముగా నెరవేరినది. ఈ బిడ్డల నిక మర్యాదాపూర్వకముగా వారి యింటికి సాగనంపవలెను గదా!కౌశికుడే యీ పనిని స్వయముగా జేయుట నీతి కాదు. రామునితో బంపుటకు దగినతోడు చూడవలెను. అంతేకాదు, యాగ దక్షిణ నీయవలెను. దక్షిణగా నీయదగిన లక్ష్మి యెచట నున్నదాయని ఆలోచించుచుండగా, నీ మిథిల మనసులో మెదలినది. నీ యింట వీనికి శాశ్వతముగా నిచ్చి వెంట బంపగల కలిమి యున్నది. దక్షిణలేని యాగము వ్యర్థము. అందరు నాహా! యని పొగడునట్లు నీవు యాగపరంపరల నెట్లు చేయుచున్నావో? నేనొక యాగ దక్షిణకే తలపట్టుకొనవలసి వచ్చినది. క్రిందు మీదులగుచున్నాను. నీకు సిరి లభించినది, కనుక నా యాగ దక్షిణ కూడ నీవీయక దప్పదు.

'నీకు లభించిన లక్ష్మి యెవరిదై యుండునో అని చింతించుచున్నావు. ఆ లక్ష్మీ విభుడు నీ యొద్దకే వచ్చును లెమ్ము, చింతించకుము. పరులసొత్తు నింతకాలము కాపాడి యున్నావు. ఇంకను ఎంతకాలము భరించగలవు? ఓ రాజా! ఎంత పూజ జేసితివో, ఎంతటి యోగావలంబన జేసితివో, ఎంత త్యాగము జేసితివో, ఎన్ని నియమము లెన్ని వ్రతము లాచరించితివో లక్ష్మి స్వయముగ వచ్చి, నీ యింట నిలచినది.

'గడ్డములు మీసములు పెంచుకొని కాషాయముల గట్టి చంకలో దుడ్డుకఱ్ఱ వలె నొక దండము ధరించి యడవులలో ముక్కుపట్టుకొని కూర్చుండినను గొప్పతనము రాదు. ఆ గొప్పతనమేదో మిన్ను విరిగి కుంటివానిపై వచ్చిపడినట్లు లక్ష్మి రావలెను. దానితో జన్మ తరించిపోవలెను. విదేహాధీశా! పాపము నాకొరకై వచ్చిన ఈ రాజపుత్రులను వట్టి చేతులతో బంపుట న్యాయము కాదు కదా!

యజ్ఞ దక్షిణ సంపాదించుటకు లక్ష్మి నీ యొద్దనున్నది కదాయని మా ముని కులముతో వచ్చి చేరినాము. ఈ ముని వాక్కును కాదనకుము. మా కార్యము నెరవేర్చుము.

'లక్ష్మి యెక్కడ? నాకు దొరకుట యేమి? యని ఆశ్చర్యపడుచున్నావా? నీవు యోగ దృష్టి కలవాడవు. దీనిని తెలిసికొనుట నీకు అసాధ్యము కాదు. నీవెక్కడి యోగివయ్యా! నీ పెరిగిన గడ్డములో నుండి చిరునవ్వు తొంగి చూచుచున్నది. మరియొక విశేషమున్నది. వందల కొలది భటులు ఎంతో శ్రమతో మాత్రమే బయటకు దేగలిగిన గొప్ప ధనస్సు నీయింట గలదని విని దాని నొకమారు చూడవలెనని ఈ రాముడు వచ్చినాడు. వీనికా ధనస్సు నొకమారు చూపుము.

'ఈ పసివాడు, మా ధనస్సు నెత్తునా? ఇది యసంభవమని చప్పరించకుము. స్వయముగా నీరాముని తండ్రి దశరథ నరేంద్రుడు కూడ నిదే విధముగా మునీంద్రా! ఈ పసివాడు మా రాముడు నీ యజ్ఞ రక్ష జేయగలడా? యని చప్పరించినాడు. ఈ బాలుని తత్త్వ మేమో యెవరెరుగుదురు? కాని నేను గుర్తించితిని. ఆత్మ దర్శనము మాత్రమే ప్రధానమని యోచించువారికీ విధమైన రహస్యము లంతుపట్టునా? రాజా! ఈ గాధి నందనునికి పూర్వజన్మముల సంబంధమైన శుభమేదియో యుండి దానికి దైవకృప తోడుపడినది. ఇక నేమి కావలెను? జన్మ ధన్యమైనది.

లోకములో ఆత్మ దృష్టి పొందవలెనను కోరిక హెచ్చుగా నుండును. గృహములో గృహ యజమాని (గృహస్తు) వలె ఆత్మకాత్మయై విష్ణువు నివసించి యున్నాడు. దీని నందరు గుర్తింప జాలరు. పరంధాముడు, పరమాత్మయునైన విష్ణుభావనా చైతన్యము లేనివారికీ సత్యము కనిపించదు. ఓ భూపతీ! నీవు భూత వర్తమాన భవిష్యత్తుల నెరిగినవాడవు. భావనాశీలి, గుణవంతుడునగు శతానందుడు నీకు పురోహితుడైయున్నాడు. వీనికి తోడు దేవతవంటి పుత్రిక యదృష్టవశమున నీకు దొరకినది. ఇంకేమి కావలెను?

“ఈమెయేకాక నీకు ఊర్మిళయను (ఔరస) కన్నకూతురు కలదట కదా? కర్మవీరుడు, కుశను ధ్వజముగా స్వీకరించినవాడునైన కుశధ్వజుడు నీ తమ్ముడు కదా? అతడును పుత్రికలు కలవాడే కదా! ఈ విషయములు తరువాత ముచ్చటించుకొన వచ్చును. రాజా! అదిగో ప్రొద్దు క్రుంక నున్నది. ఏ సమయమున జేయదగిన కర్మ నా సమయముననే చేయు నిష్ట గలవాడవు. నీకిపుడు చేయదగిన వైదిక కర్మలు కలవు. ఇక నేనో? కర్మను సేవగా మార్చి యీ కౌశికు డిప్పుడు కాలము గడపుచున్నాడు. రాజేంద్రా! కర్మయోగికి చాకిరి బారెడు, ఫలితము బెత్తెడు. సేవావ్రతపరుడే పుణ్యము జేసుకొన్నవాడు. ఇంతకు పూర్వము నేనును కర్మయోగావలంబన పరుడనే. ఎంతో కాలము తపస్సులో గడపితిని. ఫలమే మాత్రము పొందక పోయితిని. నా మనస్సింతలో రామసేవకు పూనుకొనినది. రాజా! ఈ రాముడు నన్ను మోహములో పడవేసినాడు.

‘దీనితో వేళకు నిద్రలేదు. స్నానము, సంధ్యోపాసన సకాలమున సాగుట లేదు. యోగాభ్యాసమును అంతే. జపతపములు వేళకు జరుగుట లేదు. వేళకు తిండి లేదు. అన్ని వేళల సర్వము నీరాముడే. నిరంతరము రాముడే కనిపించును. అంతట నన్నిట రాముని దర్శనమే. ఇంకేమి చేయగలనో చెప్పుము. స్నానమాడబోగా నీటిలో విచ్చిన నీలికలువ రంగులో రాముని స్వరూప రేఖ దర్శనమిచ్చును. సూర్యున కర్ఘ్యమీయ బోయిన సూర్యబింబమున రామచంద్రుడే కనిపించును. నిష్ఠాపరుడనై ధ్యానము జేయబోగా మనోనేత్రమున నీ రామ సాక్షాత్కారమే.

‘రాజా! ఇట్లు వాని కృప నాపై ప్రసరించుటకు కారణము ధ్యానమా? దానమా? తపస్సా? శౌచమా? ధర్మాచరణమా? పూజయా? సుకృతమా? అరణ్యమున నేకాంతవాసమా? జపమా? సత్కర్మాచరణమా? జ్ఞానమా? భక్తియా? తీర్థస్నానమా? ఇవి యేవియు స్వామికి బ్రేమ జూపు సూచనలు కానే కావు. ఎన్నడైన నివియేవియైన నున్నను లేకున్నను స్వామి కొక్కొక్కప్పుడు

ఒక్కొక్కనిపై నకారణముగానే కటాక్షము కలుగు చుండును. ఈ విషయములపై వాదోపవాదము లాడరాదు. తండ్రి బిడ్డపై నతడేమి చేసెనని ప్రేమ జూపును?

'అందరి విషయమున నిట్లేనా? యను జనసామాన్య చర్చకాదు, కాని లోకములో నొక్కొక్కని మనస్సున నేకారణము లేకుండగనే పున్నమినాటి చంద్రునివలె భక్తి సముద్రమును పొంగజేయును. ఇది యా పరంధాముని లీలావిలాసము, కటాక్షము. ఇటువంటి శుభకామన నాకు లభించినది. నేను యాగ దీక్షబూనగా రాక్షసులు దానిని విఘ్నము జేయ యత్నించిరి. దానితో వ్యధనందితిని. నిరాశ కలిగినది. అంతలో రాముడు దర్శనమిచ్చి అయోధ్య రమ్మనినాడు. కనుకనే వేరొక చోటికి వెళ్ళక, అచటికే బోయితిని. రాజా! అచట నన్యోన్య దర్శనముచే మామధ్య యనుబంధమేర్పడినది. ఆగమము, యాగము, యోగము, దర్శనము నను నవి మాకిపుడు శాస్త్రములు, కర్మాచరణము వంటి పూర్వపు అర్థముల నిచ్చుట లేదు. ఆగమమనగా మాకిప్పుడు రాముని రాకయే. యోగమనగా రాముడు మాయెదుట నుండుటయే. యాగమనగా రామజపమే. దర్శనమనగా వాడు మేము నొకరి నొకరము చూచుకొనుచు నుండుటే. ఇట్లు మాకిపుడు సర్వము రామమయమే. నేను ధన్యుడనగుటకు వేరేమియు లేనేలేవు.

'రాముని శరీర కాంతి ప్రవాహములో మునుగుదును. రఘువీరుని దివ్యమైన కథా ప్రసాదమును భుజింతును. ధ్యానమను పేరున రాఘవుని చింతన జేయుదును. ఇపుడీ కౌశికుని కర్మయోగమిట్లున్నదయ్యా! ఇప్పటికే ఆలస్యమైనది లెండు."

విశ్వామిత్రుడు రామగుణగానము జేయుచు నొడలు మరచును. జనకుడతిథులకు విశ్రాంతి మందిరపు దారి జూపుచు కౌశికునితో నిట్లనెను.

"మునిశ్రేష్ఠా! నాకును మీవలెనె నెందు చేతనోకాని మునుపటి వలె కర్మనిష్ఠలో క్షణమైన మనసు నిలుచుట లేదు. సీత నాయింట జేరినది మొదలు

నా స్థితి యిట్లున్నది. కారణమేమందువు? స్నానము జేయబోయెదను, చేయకయే, స్నానము జేసితిననుకొని తిరిగి వచ్చెదను. ధ్యానము జేయబోయి చేసితిననుకొని విరమించెదను. ఋషివర్యా! నా మనస్సిట్లు మారినదేమి? ఎప్పుడును జానకియే కనబడుచున్నది. సంతానము కలిగిన యోగముండదా? మునిరాజా! నాగటి చాలున దొరకిన బిడ్డకు సీతయను పేరు పెట్టి చక్కగా పెంచుకొనుచుంటిని. పెంచిన దోషము చేతనేమో? నా యోగమంతయు పోయినది. ఇప్పుడీ బాల పెండ్లియను యోగమొకటి పట్టినది. ఎట్లు నెరవేర్పగలను? ఔరా! పగవానికైనను స్త్రీసంతానము వద్దయ్యా! మహర్షీ!

'సీత అయోనిజగ భూమిలో దొరకుట, జానకి యొక్క అసాధారణ చర్యలు, మైథిలి మాట్లాడు మాటలు, భూపుత్రి నడవడి, ఆమె రూపము నా మనసున దలపోయగా మునిరాజా! నా జన్మ తరించిపోయినది. జానకి నా పుత్రియని ప్రసిద్ధి పొందితిని కదా! యను తృప్తి పొందితిని. ఇచటి కామె యెట్లు వచ్చినది? వచ్చువరకు మట్టిలో నెట్లున్నది? పెట్టెలోనికెట్లు వచ్చినది? ఎవరామె నందులో బెట్టిరి? నా నగరమునకామె యెందుకొరకు వచ్చినది? నాకే ఎందుకు దొరకినది? ఈ రహస్యములను తెలుసుకొనలేక మునిశ్రేష్ఠా! ఆలోచించి యాలోచించి, ఏమియు తోచక, ఆలోచించుట మానివేసితిని.

'జానకి'నే ఆత్మగా తలచుచున్నాను. కర్మమయ, జ్ఞానమయ రూపమైన సీతను – ఒక సుందరుడైన పురుషోత్తముడు వచ్చినచో నతని కర్పణ జేయ జూచుచున్నాను. మునీంద్రా! వినుచున్నావుకదా! అంతవరకు నా మనసుకు వ్యథ తప్పదు. సీత కనిపించినచో నాత్మదర్శనమైనట్లానందము కలుగుచున్నది. వివరించి చెప్పలేకున్నాను. కాని మనసున నేదో చిన్మయరేఖ గోచరించుచున్నది. దీనితో నేనొక క్రొత్త యోగినైతిని. చూచుచుండగా నేనెంత మారిపోయితిని!

"ఏదియు నంటియు ముట్టనట్లు ప్రవర్తించెడు నేను, గృహమును నేడు నా యిల్లనుకొనుచున్నాను. ఊర్మిళను కాదనుకొనకున్నను సీతను నాదని

యనుకొనుచున్నాను. పైకి కర్మాచరణము జేయుచున్నను, దానియందు ఇదివర కుండెడి నిష్ఠలేదు. ఇప్పుడు నాతపస్సంతయు జానకియే. మునిచంద్రా! భూమిలో జన్మించినందు చేతనేమో? సీత క్షమాగుణమే రూపుదాల్చినట్లు కనిపించును. మేము జనక నామము ధరించిన వైశాలీయులము. కనుక జనక వంశములో వచ్చుచున్న గొప్ప విశాల సంప్రదాయము లెరిగి ఈ జానకి తన పేరు సార్థకము చేసుకొనినది.

జానకియను పేరు ఊర్మిళకే గాని సీతకెట్లొప్పును? అది సరికాదని తెలిసియును, సీతయందలి మమకారముచే సీతనే జానకిగా పిలచునట్లు చేసినది. జానకివలన మా వంశమున నాతో సహా పూర్వపు ఏడు తరముల వారు, బంధువులు, మా పట్టణ ప్రజలు, మహర్షీ! తరించి పోవలెను. ఇంతటి గొప్ప జన్మ కల మా సీతకు ఈడై పుట్టియున్న పురుషోత్తముడు తానే ముందుకు రావలెను. వాని కొరకై విల్లును నిర్ణయించి యుంటిని. వాడు కనుపించు నందువా? వచ్చునందువా? నాకంతటి యదృష్టము పట్టునా? ఆ శుభసమయ మెప్పుడో కదా! సెలవు. రేపు కనిపించెదను.”

జనకుడంతఃపురమున సీతతో నిట్లనెను. ఆ సమయమున జనకుని భార్య, పురోహితుడు శతానందుడు కూడ నచటనే యుండిరి.

“జానకీ! నేడు మన యజ్ఞశాలకు మానవాతీతమైన చర్యలు కలవాడు, మునిశ్రేష్ఠుడునైన విశ్వామిత్రుడు వచ్చినాడు. అతడు మహాజ్ఞాని, పరోపకారి, దయాసముద్రుడు. అట్టివాడు నన్ను జూడవచ్చెను. అతని రాకకు యజ్ఞ పురుషుడే దిగివచ్చినంతగా సంతోషించితిని. ఆహా! అతడెంతటి వాడు! పంతగించి యొక జన్మలోనే క్షత్రియుడైనను బ్రాహ్మణుడు కాగలిగెను. మహాఋషి యయ్యెను. త్రిశంకు చక్రవర్తిని బొందితో స్వర్గమునకు పంపినాడట. అంతటి వాడెంత ప్రేమయున్న మన యింటికి వచ్చును?

‘మన పురోహితులు, గౌతమ మహర్షులవారి పుత్రుడు నగు ఈ

శతానందుడా విశ్వామిత్రుని చరిత్ర యంతయు ఉన్నదియున్నట్లుగా చెప్పెను. నిర్మొగమాటముగా చెప్పెను. యాగశాలలోని మునులందరు వినుచుండగా చెప్పెను. ఏ విషయమును విడవక చెప్పెను. ఆ ముని కిమ్మనలేదు. ఇపుడా ముని మనస్సే వికారము పొందని స్థాయికి జేరినది. ఎంతో పరోపకార చిత్తము, దయాగుణము నుండనిదే, జానకీ! తన స్వంత బిడ్డల నందరిని శపించియైనను, ఋచీక పుత్రుడైన శునశ్శేపుని లోకమంతయు మెచ్చునట్లు యముని బారినుండి ఎట్లు రక్షింప గలుగును? అహల్యకానందము కూర్చగలుగును? అంతటి జాలి గుండె ఎవ్వరి కుండును?

'ఆ మునివెంట మహాసుకుమారులగు రాముడు, లక్ష్మణుడు నను నిరువురు రాజపుత్రులు వచ్చినారు. ముఖముపై ముంగురులు వ్రేలాడుచుండగా ముద్దులు మూటగట్టుచునున్నారు. వారి సౌకుమార్యము, మన్మథుని వంటి రూపములు చూచి తీరవలసినదే! నల్లని కలువపూవు వలెను, క్రొత్త నీలమేఘము వలెను, ఇంద్రనీలమణులు రాశిపోసినట్లు రాముడు చూచువారి మనసులు దోచుచున్నాడు. చల్లనివాడు, శ్యామలము, సుందరమైన రూపము కలవాడునైన వానియందమును వివరించి చెప్పుట సాధ్యము కాదు.

మదించిన ఏనుగు వంటి యాతని నడక, వాని కన్నులలోని అందము, ఆతని నవయౌవన వైభవము, ఆతని భుజము విల్లు బాణములతోడి వీరత్వ వైభవము, మధురమైన యాతని నడవడి చూచి నా యోగము ధన్యమైపోయినది. నేను చరితార్థుడ నైతినని తలచుచున్నాను. వానిని చంక కెత్తుకొను కోరిక కలిగినది. వానిని కౌగలించి ముద్దాడ మనసైనది. వాడు నా యెదుటకు వచ్చినది మొదలు జానకీ! అతని రూపమే మాటిమాటికి మా మనస్సును హరించి వేయుచున్నది.

"వానిని చూడవలెనని, వానికి సేవజేయవలెనని, వానికేదో సమర్పించ వలెనని, వాని గుణవైభముల గీర్తించవలెనని కోరిక. ఇట్లు వానిని గూర్చి

జ్ఞాపకములు. వానిపైననే దృష్టి. వానిని గురించియే చింతన - అంతేగాని ఇతర మేమియు మనసుకు వచ్చుట లేనేలేదు. అచట నయోధ్యలో యజ్ఞము చేయగా రాఘవుడు పుట్టినాడట. ఇచట యజ్ఞము చేయబోవగా నిధి వలె నీవు లభించితివి. క్రతువు పూర్తియై యాగఫలము లభించు కాలమిది. కనుక మీరిద్దరు దంపతులగుచో నీ జనకుని యానందమునకు హద్దులుండవు.

ఊరకనే తిని కూర్చుండి ధనస్సు నెక్కుపెట్టవలెనను పందెము పెట్టితిని. మన ధనూభారమును పండ్రెండేండ్ల వయసువాడైన రాముడు భరింపగలుగునా? నేడింటి ముందు బంగారము వంటి పెండ్లికొడుకు వచ్చి నిలిచినాడు. నేపెట్టిన పందెము నిలచియున్నది. పాపమా కౌశికునకు తన శిష్యునిపై గల వాత్సల్యము చేత 'రాజా! నీ విల్లు చూపవయ్యా! మా రఘురాముడు దీనినొక చూపు చూడ వచ్చినాడు' అనెను. నేను దీనిని యధార్థముగా దలచి మన విల్లు ముందుపెట్టి 'యెత్తుము' అనగా లోకులు నవ్విపోవుటే జరుగును.

సుకుమార శరీరుడగు రాముడు మన ధనస్సు నెత్తగలుగు ననుమాట యసంభవము. నాకాతడా విల్లెత్తగా చూచు పుణ్యము కలుగునా? అంతటి పుణ్యము నా జీవితములోనికి బరువెత్తివచ్చునా? జానకీ! ఆ దశరథుడును నేనును వియ్యమంద గలిగిన ఈ భూమియంతయు తరించిపోదా? రఘురామ చంద్రుడు ప్రసిద్ధమైన సూర్యవంశమున జన్మించినవాడే. చక్రవర్తి పెద్ద కుమారుడే, సుందరుడే, వీరుడే. నా కన్నివిధముల నచ్చినవాడే, సుబాహుని వంటి దుష్ట రాక్షసుని తన బాణ ప్రహారముచే మట్టు పెట్టిన మహాశౌర్యగుణము కలవాడే. మా భూపుత్రి కన్నివిధముల సరిజోడే, కాని ఏమిచేయగలను? మూర్ఖుడనై ధనుస్సు నెత్తుటయను పందెము పెట్టి యున్నాను కదా!

'రాముడు నిశ్చయముగా ఎవడో కారణజన్ముడై యుండును. కానిచో వన మార్గమున నడచుచుండగా నెదిర్చిన రాక్షసి తాటకను క్రూరమైన బాణముతో నప్పుడే పడగొట్టుట, గౌతమపత్ని యహల్య దారుణ శాపమను పెద్ద నూతిని

తన పాదధూళితో పూడ్చి వేయుట యను అత్యద్భుత కార్యములు సామాన్య మానవుడు చేయగలుగునా? ఒక మాట మరచితిని. విశ్వామిత్రుడు మాటల సందర్భమున రాముడు తన యాగము రక్షించినందున నతనికి యాగదక్షిణ నిచ్చి పంపవలెననియు, కాని తనవద్ద యాజకత్వము కాక వేరుగా ధనమేమియు లేదనెను. నాయొద్ద సిరి యున్నందున నాయొద్దకు వచ్చితినని చెప్పినాడు.

'నీయొద్ద లక్ష్మి యున్నది. దానిని గమనించియే వచ్చితిని. నామీద దృష్టి యుంచవలెను సుమా! యని ఆ ఋషి పలికిన మాటలలో రహస్యమున్నట్లు తోచుచున్నది. అది యేదో విశదమగుట లేదు. జానకీ! అందుచే నతని మాటలు వినియు ఔననక కాదనక ఊరకొంటిని. నా యొద్ద లక్ష్మి యుండుటేమి? దానిని రఘురామున కిచ్చుటేమి? ఈ మాటల పోకడ జూడగా నా మునిశ్రేష్ఠ డేదో నిశ్చితాభిప్రాయముతో వచ్చినట్లున్నది. ఈ చక్కని కథకు మొదలేదో తుదియేదో చెప్పలేకున్నాను."

ఇట్లు పలికి కలత నందిన మనసుతో జనకుడు మౌనము వహించెను. అంత వాని అర్థాంగి యిట్లనెను.

"నాథా! ఇంకొక విశేషమున్నది విందురా? జానకి భవిష్యత్తేమో తెలియుట లేదు. పరికించగా నది విచిత్రముగా తోచుచున్నది. ఈ రహస్యము నెవరికిని చెప్పకుండ దాచి యుంచదలచితిని. ఇక దానిని గురించి మాటల సందర్భము వచ్చినందున చెప్పక తీరుట లేదు. కొన్నాళ్ళ క్రిందట నొక భిక్షిణి – తాపసి వలె నున్నది మన భవనమునకు వచ్చినది. నాయొద్ద నున్న జానకిని పిలచి ఏదీ నీచేయి చూపు' మని ఈమె హస్తరేఖల బరిశీలించి 'సీతా! నీకరణ్యవాస యోగమున్న'దని పలికినది. నేను చాల భయపడి 'చాలులే, చెప్పినావు. అయ్యో! ఇదేమి జోస్యము? ఇక దయ చేయు' మంటిని. సీతతో 'నీ విధివ్రాత యిట్లున్నది. ఈ మాటలు మీ తండ్రిగారికి జెప్పకుము సుమా! చెప్పినచో వారికి దుఃఖము కలుగును' అని చెప్పితిని. వేరొక మారొక గొప్ప తాపసియైన విప్రుడు మన

యింటికి వచ్చెను. వానిని సీత భవిష్యత్తు ఎట్లుండునో పరిశీలింప గోరితిని. వారు గ్రహగతుల బరిశీలించి భిక్షుణి చెప్పినట్లే 'సీతకు వనవాస యోగమున్నది అది తప్ప'దనిరి.

'వారిర్వురి మాటలు మననము చేసుకొనుచు నేనెంతో దుఃఖితురాల నగుచుండగా, సీతకో? ఈ భావన ఎంతో నచ్చినదట. తనకు వనవాసమే కావలెనట. తనను గూర్చి చెప్పిన మాటలు నిజమగునట. నీ కోరికలన్నియు మీ నాయన గారికి చెప్పుమమ్మా!"

తన పత్ని మాటల నాలకించిన జనక భూపతి పెదవులపై చిరునవ్వు నాట్యము చేసినది. సీతయు సిగ్గు బరువుచే ముఖము వంచి నడక రాయంచల ఠీవిని ప్రదర్శించగా నటనుండి మెరుపు దీగవలె భవనములోనికి బరువెత్తినది.

ఇంతవరకచటనే జరిగిన సంభాషణ కంతకు సాక్షిగా నుండి ఆలకించిన శతానందుడు "రాజా! నావిన్నపమొకటి వినుము. సందేహముగా నుండిన అన్ని విషయములు విశదము కాగలవు. మా తండ్రి గౌతములవారు నాపై దయతో మైథిలి కథ జెప్పినారు. జానకి యసలెవరో, అయోనిజగా భూమిలో బాలికగా నెందుకు లభించెనో, అందుకు కారణము లేవో, మూలతత్త్వమేమో సర్వము తమ జ్ఞాననేత్రముతో చూచి చెప్పినారు.

'ఇది కుటుంబ రహస్యము. ఇందు మాతల్లి కథ ఇమిడి యున్నందున వెల్లడించరానిది. కాని ఇప్పుడు దీనిని మరుగుపరచియుంచినను ఏదోనొక విధముగా నా తరువాత వెల్లడికాక తప్పదు. దైవవిధి ననుసరించి ఎందరెందరో మహాత్ములును తమ హద్దులను మీరి యపకీర్తి పొందుచుందురు. మా తల్లి దండ్రులు నేను చల్లగా ప్రశాంతముగా నుండగా మా యింట సురేశ్వరుడైన ఇంద్రుడగ్ని ముట్టించినాడు. చక్కటి కాపురముల నల్లరి పాల్జేయుటకు కన్ను మిన్ను గానని పాపాత్ములు దాపురించు చుందురుకదా!

'మచ్చ యెరుగని మాతల్లిని మదాంధుడై ఇంద్రుడు గౌతమ వేషముతో

వచ్చి మోసగించి పోయినాడు. ఈ దుర్మార్గము నెరిగి మాతండ్రి నాతో 'పుత్రా! ఈమె యిపుడేడ్చి ప్రయోజనము లేదు. నీతల్లి దేవరాజు మీది కోరికతో పతితురాలైపోయినది. పాపమెప్పుడైన బద్ధలై తీరును. నీ తల్లి సంపాదించిన పాపము బూడిదవలె నీమెను కప్పియుండును. ఆ పిమ్మటనే శుద్ధురాలగును. నీ దుఃఖము నా మనసును కలచివేయుచున్నది. అయోనిజగా జన్మించిన ఈమె, నాయంత వానిని పెండ్లాడి. ఇంతటి పుత్రుని కలిగియుండియు నీ పాపకార్యమునకు తెగించినది. దీనిని సహించుటెట్లు? అమరేంద్రుడు నీమెయు కూడ శిక్ష పొందవలసిన వారే.

'ఈమె అయోనిజ, ఈమెకే పాపములు నంటవని కొందరనవచ్చును. కలికాలములో నీమెను పరమసాధ్విగా తలచవచ్చును. స్త్రీయైనను తన పాపమునకు శిక్ష పొందవలసినదే. క్షమాగుణముచే పాపమును ఉపేక్షింప కూడదు. పుత్రా! ఈమెను గూర్చి కంట తడి పెట్టకుము. పాప పరిహారమునకు మంచి కాలము రావలెను. అప్పుడు రాముడను పేరుతో సాక్షాత్తు నారాయణు డిచటికి రాగలడు. అతని పాదధూళిచే మన ఈ వంశమంతయు తరించగలదు. నీతల్లి యహల్య శుద్ధురాలగును' అనిరి.

'నాకు దుఃఖ మాగినది కాదు. మా తండ్రి పాదములపై బడి 'తండ్రీ రాముడెవరు? నీవును నేనును నేమైపోవుదుము? రాముడు వచ్చువరకు మాతల్లి గతి ఇంతేనా? ఆ పరంధాముని పాదధూళి మనపై నెప్పుడు పడును? తండ్రీ! చెప్పుము నా మనసు చిచ్చులో పడి దొర్లుచున్నట్లున్నది' అని ప్రార్థించితిని. భవిష్యత్తులో నేమి జరుగునో దానిని తన యోగ దృష్టితో పూర్ణముగా నెరిగిన నా తండ్రి 'నాయనా! శతానందా! లోకాతీతమైన, మహత్తరమైన గాథను తెలుసుకొంటిని. దానిని ముందుగానే పూర్తిగా వివరించుట మంచిది కాదు. కాని, నీ దుఃఖమును చూడలేక దానిని చెప్పుచున్నాను.

'శాపమెప్పుడును తగిలి తీరును. దానిననుభవించి తీరవలసినదే. నీ తల్లి

యిచట ధూళిలో నెవరికి కనబడకుండ తన పాపము నశించు వరకు నుండును. నేను వేలాది సంవత్సరములు తపస్సు చేయుటకు హిమాలయములకు వెళ్లెదను. మన సమీపమున గల మిథిలాధిపతులకు పురోహితుడవుగా నీవు కాలము గడపుచుండుము. మిథిలాధీశులు ప్రసిద్ధ నిమి వంశమువారు. వారి ఆశ్రయమున నుండి కీర్తి నార్జింపుము. నాయనా! మిథిలా నగర భాగ్యము పండగలదు. ఎట్లందువా? కమలాలయయైన లక్ష్మి అయోనిజగా మిథిలాధిపతికి యాగభూమిలో దొరుకగలదు. నాగటి చాలున దొరకుటచే నామె సీతయను పేరు పొందగలదు. జనకుడు తన యోగము పండినదని ఆనందపడునే గాని, ఆమె యెవరను యోచన జేయడు. సందర్భము వచ్చినప్పుడీ విషయమిట్లతనికి దెలియజెప్పుము.'

'పంక్తి కంఠుడైన' రావణుడను రాక్షసుడొకడు కలడనియు, వాడు కోరి తపస్సు చేసి బ్రహ్మచే మానవులు కాక మరెవరి చేతను చావులేకుండ వరము పొందినాడనియు నీకు దెలిసి యుండును. వాడా వర గర్వముచే విఱ్ఱవీగుచు పతివ్రతలను, మునులను కూడ హింసించుచు ముల్లోక విజయుడై యున్నాడు.

ఒకప్పుడొక మహాఋషి వేదపఠనము చేయుచుండగా వేదవాక్కులతో కూడి మహాలక్ష్మి వానినోటినుండి వెలువడినది. ఆ కారణము వలన నామె వేదవతియైనది. ఆమె శ్రీమహావిష్ణువునే భర్తగా పొందగోరి తపస్సు ప్రారంభించినది. రావణుడామెను చూచి, ఆమె యందమునకు ముగ్ధుడయ్యెను. సాహసముతో నామె జడలు పట్టుకొనెను. ఆమె ఛీత్కారము చేసి తన అరచేతినే ఖడ్గముగా చేసి నా జడలను తెగగొట్టి 'మూర్ఖా! నేను విష్ణుదేవునికి నివేదితను. నన్నవమానించిన నీ ప్రాణముల దీయుటకు మరల జన్మించెదను' అని పలికి తన శరీరమును యోగాగ్నిలో దహించి వేసినది.

'తన మాట నిలుపుటకై రావణుని లంకలో ఒక పద్మవనము (సరస్సు)లో పద్మకోశమున అయోనిజగా పద్మాలయ యైన వేదవతి పుట్టెను. శివార్చనకై

పద్మముల సేకరించుట కచటికి వచ్చిన రావణుడు పద్మమున వెలుగుచున్న స్త్రీ శిశువును చూచి ఎవరీ బాలిక? యని ఆశ్చర్యపడెను. ప్రహస్తుడు మొదలైన రావణుని మంత్రులు 'రావణప్రభూ! ఈ బాల నిన్ను చంపుటకు వచ్చిన వేదవతి'యని చెప్పగా, రావణుడు వ్యథ చెంది ఆ బాలిక నొక పెట్టెలో బంధించి సముద్రమున పారవేసెను. సముద్ర కెరటములా పేటికను విదేహ ప్రాంతమునకు జేర్చినవి. కాలక్రమమున నా చోటు పూడిక పడినది. నీవు యజ్ఞము నిమిత్తము నేల దున్నుచుండగా, రాజా! భూపుత్రియై ఆ బాలిక నీకు దొరకి సీతయైనది. ఈ అదృష్టము ఏ ప్రభువుకు దొరకునయ్యా! ఇట్లు యీ మన కూటమంతయు సిరికూటమే కదా!

"తనకు వద్దు' అని ఎవతె నా రావణుడు సముద్రములోనికి విసరివేసెనో వాడే ఆమెను తిరిగి తన లంకకు తీసుకొని వెళ్లును. దానితో వాని సమూల నాశన మగును. ఇది యిటు పై జరుగబోవునది. దానికొరకెదురు చూచుచుండుము. కనుక సాక్షాత్లక్ష్మియే సీత. రావణ సంహారమునకై అయోనిజగా యాగభూమి నుండి పైకి వచ్చినది. అన్నియు కలసి వచ్చినవి. ఆమె రాముని సాక్షాత్తు శ్రీమహావిష్ణువుగా గుర్తించి యుండును. అందుకే వనవాసము తనకిష్టమనినది. వనమనగా పరంధాముడే. వాసమనగా నతనితో కూడియుండుట. మరొక ధ్వని కూడ ఆ మాటలో నున్నది. పతితో కూడి వనవాసమునకు వెళ్లి రావణుని హతమార్చెదననియు అని యుండవచ్చును. మన సీత మాటలలో నిన్ని వనవాస వాసనలున్నవి.

'ఇక ఇచటికి వచ్చిన రాముని పసివాడని తలపకుము. ఆ నల్లకలువ మొగ్గ శివుని విల్లెత్తునాయని సందేహపడకుము. వట్టి మాటగా భావించకుము. ఆ రాఘవుని అమానుష శక్తి రేపు చూడగలవు. దీనిని మరింత వివరించెదను. రాముడు మానవుడని భ్రాంతి పడకుము. పరంధామమును విడచి యా పరంధాముడే దశరథరాముడై భూమికి వచ్చినాడు. దీనికి గల కారణమేమో

తెలుసుకొంటివా? సీతపట్టిన పంతమే స్వామిది కూడ. వీరిద్దరును వచ్చినది రావణ వధ నిమిత్తమే సుమా!

'సతి యేమో ప్రతిజ్ఞ పట్టినది. పతి దానిని నెరవేర్చ వచ్చినాడు. ఇక పాపకర్ముడగు రావణ వధ జరిగి తీరును. సతీపతులు సీతారాముల రూపములో వచ్చినారు. ఎంత వింత కథ! రాజా! విన్నావు కదా? రాముడే శ్రీమహావిష్ణువు. సీతయే మహాలక్ష్మి. చూచుటకు రాఘవుడు సామాన్య మానవుడుగా కనిపించును. వాని చర్యలో? లోకోత్తరములు. స్మరించదగినవి. వాని ప్రభావము అద్భుతము. దైవ సంబంధమైనది. నీవు దివ్యదృష్టి కలవాడవు. నీవంటి వారికీ విషయములు తెలిసియుండును. ఏవియు దాచక మా తండ్రి గౌతముల వారివి యన్నియు నాకు జెప్పిరి.

'ఇంతటి మహానుభావుడు రఘురాముడు శివధనస్సు నెత్తకపోవునా? తాటకను చంపినవాడు కదా? సుబాహుని వధించినవాడు కదా? మారీచుని ఎండుటాకు వలె నెగురగొట్టి నడి సముద్రమునకు విసరివేసినవాడు కదా? నిన్ననే మాతల్లి యహల్య శాపమును ఇట్టే పోగొట్టెను కదా? అతడు స్వర్గమును భూమిని ఏకము చేయగోరినచో, ఆ గొంతెమ్మ కోరికను సైతము నెరవేర్చియే తీరును. నిగ్రహించినచో ఎంతటి వాడైనను వానికి లోకువయగును. దయజూపినచో నంతటి దయజూపగలవాడు వేరొకడు వెదకినను కనబడదు.

'అంతటి రాముని ప్రక్క కౌశిక మహర్షి యున్నాడు. రాజా! వానికి శివుని విల్లెత్తు టెంతపని? గురుశిష్యులొకటై నీవద్ద జేరినారు. గురువు త్రిశంకునెత్తెను. శిష్యుడు రేపు అవలీలగా మన విల్లెత్తును. ఏది యేమైనను రేపిది జరిగి తీరును. భూపుత్రి సీతతో కళ్యాణమగును. ఆ తరువాత చిత్రవిచిత్ర పరిణామములతో వారి కథనే కవికోకిలయో మనోహరమగు గీతములలో వ్రాసి యీ లోకమున నిలుపును. ఆది దంపతులైన లక్ష్మీనారాయణుల కథ ఆదికావ్యము కాగలదు.

రాముడు నీలమేఘము, మీ కుమార్తె విడువక దాని వెంటనుండు మెరపుతీగ. గుణవంతుడగు రాఘవుడు పుష్పము, నీ కుమార్తె దానినంటి యుండు

సువాసన. అతడు రత్నము. ఆమె దాని మెరుపు. శ్రీరాముడు సూర్యుడు, సీత సూర్యప్రభ. రాముడు చంద్రుడు, సీత వెన్నెల. పది దిక్కులందు తన రథ చక్రములచే దారులేర్పరచి దశరథుడైన మహాత్ముడు రాముని తండ్రి. వానికి పట్టపు రాణులు ముగ్గురైనను దశ కలవాడైనందున వందల కొలది భార్యలు కలవాడై యున్నాడు. ఆయా సందర్భములలో దేవేంద్రుని గద్దె నెక్కిన పుణ్యవంతుడు. అంతటి తండ్రి తనయుడైన శ్రీరాముడింతటి వాడు నీకు యల్లుడగుట ఎంత భాగ్యము!

ఈ మాటలు వినిన జనక పత్ని చేతులెత్తి నమస్కరించి "మహానుభావా! శతానందా! మా కింతటి వారితో వియ్యమక్కరలేదని విన్నవించుకొనుచున్నాను. అంతటి తండ్రి తనయుడు ఇంకను ఎంతటివాడు కాగలడో! తండ్రికి భార్యలు ముగ్గురా? మూడు వందల పైగా నితరభార్యలా? తండ్రి పోలిక కుమారునకు రాకుండునా? ఈతడెంత మందికి తాళిగట్టి ఇల్లాండ్రను చేయునో? నల్వురు నవ్విపోవుదురు. ఈ సంబంధమే జరిగినచో నిక మా సీతకు మనశ్శాంతి యుండునా? ఆ రాముడు మా ధనస్సు నెత్తినచో నెత్తనిమ్ము. మేము మా సీత నతని కీయజాలము" అనెను.

రాణి మాటలు వినిన శతానందుడు ముఖమున జిరునవ్వు చిందుచుండగా నిట్లనెను "సాధ్వీ! రాముడటువంటి వాడు కాడు. ప్రసిద్ధమైన నడవడి కలవాడు. కలలో గాని, మనస్సున గాని, చూపులో గాని, వాక్కున గాని పర స్త్రీల దలపడు. వాని యొద్ద వాని తండ్రి పోలికలు కనిపించవు. అందుకు కారణమేమనగా నీతడతి పవిత్రమైన భగవత్ప్రీతికై చేయబడిన యజ్ఞమున పాయస రూపముగా లభించి ప్రసాద మహిమచే పుట్టినవాడు. కావున నొకవిధమున నయోని జన్మకలవాడే యగును. సీతకు రామునకు నెవరిని తలిదండ్రులుగా చెప్పగలము? యధార్థమున కీ యిద్దరే లోకములకు జననీ జనకులు.

'తండ్రి యనేక భార్యలు కలవాడనుట సత్యమే. ఐననేమి? పుత్రుడటు వంటివాడు కాడు కదా! సూర్యవంశమొక మహాసముద్రము వంటిది. దానిని

పొంగిపోవునట్లు చేయువాడు రామచంద్రుడు. ఏకపత్నీ వ్రతము కలవాడు. సీతాకుమారిని బంగారు బొమ్మగా జూచుకొని గౌరవించ గలవాడు. జనకుని యదృష్టమే లక్ష్మీనారాయణుల జంట నీవైపునకు తీసుకొని వచ్చినది. వియ్యంకులలో నొకడు భోగి మరియొకడు కర్మయోగియు. ఇట్టివారి మధ్య వియ్యము నెయ్యము సంఘటపరచిన కర్త కౌశిక ముని. అతడే దాత ప్రతి గ్రహీతల యోగ్యతలు నిర్ణయించినవాడు.

'ఏదియు నంటకుండున ట్లాత్మ చింతనాపరుడై యుండువాడీ జనకుడు. తన భవనముననే ఉండి పుత్రి సీత పెండ్లి విషయమున కలత పడుచుండెను. మహాత్ముడగు కౌశికు డీ సంగతి తెలుసుకొని రాముని వెంటబెట్టుకొని వచ్చినాడు. ఓ రాణీ! ఇతరులు వ్యధపడుచుండగా దానికై తాను బాధపడుచు ఓ పిసరంత సాయపడువాడే కదా! నిజమైన మానవుడు? మంచి గుణము జన్మతో రావలెను. అట్టివాడు తప్పక దైవాంశలో బుట్టినవాడై యుండును.

దశరథుని బహుభార్యాత్వము తెలిసినదే. కాని వాని పూర్వులైన సూర్య వంశస్థులైన రాజులు గొప్ప యోగులు, అఖండ త్యాగులుగా నున్నారు. దీనితో లోకమున గొప్ప కీర్తి నొందిన మహామహితాత్ములైయున్నారు. సత్యము పలికియున్నారు. బుద్ధి వైభవము కలవారై యున్నారు. భరత ఖండ నరేంద్రులందరు వారికి లొంగి తలలు వంచి సమర్పించిన నమస్కారముల నందుకొని యున్నారు. చక్రవర్తులై యున్నారు. లోకమంతయు నాశ్చర్యము పొందునట్లు దేవనది గంగను దివినుండి భూమికి దెచ్చిన భగీరథుడు, అడుగ వచ్చిన కౌత్సునకు చాలు, చాలనునట్లు అపార ధనరాసులు కుమ్మరించిన రఘు మహారాజులు జన్మించిన వంశము వారిది. వారితో నెయ్యము, వియ్యము పొందుటకు మనము త్వరపడవలసి ఉన్నది.

దశరథుడెంతో అదృష్టవంతుడు. తల్లీ! అతడెంతో తపస్సొనర్చి అన్ని దిక్కుల తన కీర్తిని వ్యాపింప జేయగల రామచంద్రుని పుత్రునిగా పొందిన అదృష్టవంతుడు. సిరిగల చోటికే అందరు పరుగులు పెట్టెదరు. మన యింట

నామె యున్నది. కనుకనే ఆమెను వెదకికొనుచు యోగ్యుడగు పెండ్లికొడుకే నడచి వచ్చినాడు. మన సీత భూమిలో లభించిన బంగారు నిధి. దానిని ఆభరణముగా ధరించుటకై వచ్చినవాడు రాఘవుడు. ఆమె మెరపుతీగ యైనచో నతడు దానికి చోటైన నీలమేఘము కాగలడు. ఇట్లు విడదీయరాని అఖండ తేజమేదో ఈ భూమిపై నడచి వచ్చినది.

దాశరథి వెంట వచ్చిన వారెవరనుకొనుచున్నావు? ఆ మహామహుడు మరెవరో కాదు. సాక్షాన్మహావిష్ణువే భూమిపై నవతరించగా నెంతో ప్రీతితో స్వామి సేవ చేయుట కొరకు ప్రసిద్ధుడగు ఆదిశేషుడే లక్ష్మణునిగా వెంబడించి వచ్చినాడు. ఈ విధమున శేషియు శేషుడును కలసియే వచ్చినారు. అన్నను వదలి లక్ష్మణుడొక క్షణమైన నుండలేడు. అతనికి తండ్రి మాటకంటె పెదతల్లి మాటయే లక్ష్మణ రేఖ. కౌసల్య మాట జవదాటడు. ఆ రామానుజుడు మన యూర్మిళ కన్ని విధముల దగినవాడు. నా మాట కాదనక వాని యోగ్యతలను గుర్తించి వారిరువురికిని బెండ్లి చేయుడు.

'భరతుడు, శత్రుఘ్నుడు రాముని తమ్ములు. వారిద్దరు నా వైకుంఠనాథుని సుదర్శన చక్రము, పాంచజన్య శంఖమునై యున్నారు. రామ లక్ష్మణులు, భరత శత్రుఘ్నులు రెండు జట్లు. జట్లలో నొకరు మరొకరిని వదలియుండరు. కనుక భరత శత్రుఘ్నులు మన కుశధ్వజ పుత్రికలకు దగిన వరులుగా నెన్నదగినవారు. అయ్యో! తెలవారుచున్నది. జనక భూపతీ! సీతారాఘవుల దివ్యకథా ప్రసంగములో రాత్రి యిట్టే గడచిపోయినది. సూర్యోదయముతోనే రాముడును కౌశికుడును మన వింటిని జూడవచ్చెదరు. మన మిరువురము వేగిరమే వెళ్లవలసియున్నది."

ప్రొద్దు పొడుపుతోనే విశ్వామిత్రుడు 'వత్సా! రామా! వింటిని చూడు' మనగానే రాముడు దాని నవలీలగానెత్తి, ఎక్కుపెట్టునంతలో నది నడిమికి విరిగినది. ఆ శుభవార్త తెలిసిన వెంటనే దశరథుడు సకుటుంబ సపరివార సమేతముగా మిథిలకు వచ్చెను. శుభమనుచు జనకుడు తనపుత్రి మైథిలి

చేతిని రామచంద్రుని చేత నుంచి పాణిగ్రహణము జరిపించుటయు నొకదానివెంట మరొకటిగా జరిగిపోయినవి.

సీతారాముల వివాహ సందర్భమున జనక మహారాజు రామచంద్రునితో నిట్లనెను.

"నాయనా రామచంద్రా! ఇన్ని నాళ్లకు నా మనోభారము తీరినదయ్యా! నీ శ్రీపాదములు కడిగి యాపవిత్ర జలము నా తలపై జల్లుకొన్నాను. దానితో నేను మాత్రమే కాదు, నా పూర్వులును తరించినారు. నీకు కన్యాదానము జేయుట నా యదృష్టము. నా వెఱ్ఱికాని, రాఘవా! నేనిచ్చుట యేమి? నీవు పుచ్చుకొనుటేమి? సొత్తు నీది. దానిని నీకిచ్చితిని. ఈ కృత్యమును దానమనుట వెఱ్ఱికాక మరేమగును? ఇది త్రేతాయుగము. ఈ యుగమున పుచ్చుకొన దగినవాడు కనిపించినప్పుడు, వానికి దానమిచ్చుట యోగ్యమని పండితులు చెప్పుదురు. ఆ కారణముచేత దానమంటినే గాని వేరుకాదు.

తండ్రీ! రామా! వచ్చితివా? ఇచట నీయమూల్య వస్తువు ఉన్నదని తలచి నడచి వచ్చితివా? అదియే చాలును. నా ముచ్చటయు నెరవేరినది. ఈ సంగతి నెరుగలేక మందబుద్ధినై పందెము నిర్ణయించితిని. అది నెరవేర్చినందుకు ఇచ్చినట్లు సీతనిచ్చితిని. నీకింతటి శ్రమ కలిగించిన నన్ను క్షమింపుము. రామా! ఇటు చూడుము. స్వయముగా సీతయే ఇచట నుండగా, రత్నముననామె ప్రతిబింబము జూచుటెందులకయ్యా! మెరుపును వలె కనులెత్తి చూడజాలని తేజస్విని మా సీత. నీ బహుకాలపు కోరిక నేడు నిజమై నీయెదుట నిలచియున్నది, వీక్షింపుము. ఈమె నీ సిరి. నీ సిరిని నీవు చూచుకొనుటకు సిగ్గుపడుటేలనయ్యా! నేను భూమిని దున్నుచుండగా నిధివలె నీమె దొరికినది. ఇదే మా యిరువురి సంబంధము. దొరికిన సొత్తెవరిదోయని ఇన్నాళ్లు ప్రేమతో కనిపెట్టియున్నాను. తెలిసిన వారది నీ సొత్తని జెప్పిరి. ఈ నిధికి యజమానివి నీవు. కనుకనే చేయి చాపి దీనిని గ్రహింపుమంటిని. నీకు గాక మరెవరికిని మా శివధనస్సు నెత్తుట సాధ్యముకాని పని. దానిని నీవెత్తితివి. అందుకు బహుమతిగా నీ

జనకుడు శాశ్వమైన దేమి యిచ్చునో చూతునుగాక! అనుకొనుచుంటివి కాబోలు. ఇదిగో నీ నీలమేఘమునకు బంగరు టంగీ వేసితిని. రాఘవా! సంతృప్తి నందింతివి కదా!

ప్రజలు తన కతి బాధ కలిగించినను భూదేవి యేవిధముగా వారికి పంటలనిచ్చి రక్షించునో, ఈ మా సీత భూపుత్రియగుటచే, తననెవరేమి యనినను, వారెంత దుష్టులైనను, వారెవరైనను, వారి యెడనోరిమి, కరుణ జూపుచుండును. నేరమెంత? నేరమేమియని ఆమె పరిగణించదు. నీవును అటులనే సీతను జూచుకొందువా? మీ వంశపు మూలపురుషుడు సూర్యుడు. కనుకనే మీరు సూర్యవంశపు వారైనారు. మా గురువు యాజ్ఞవల్క్యుడు సూర్యుని శిష్యుడు కనుక నేను సూర్యునికి ప్రశిష్యుడనైతిని. యాజ్ఞవల్క్యునితో మాకు గురుశిష్య సంబంధము వలె, మీకును మాకును సీతావైవాహిక మూలముగా వియ్యమై బంధుత్వ మేర్పడినది. కనుక మాకీ సూర్యసంబంధ మిప్పటిది కాదు. సూర్యుని నాటి నుండి నేటి వరకు కొనసాగుచునే యున్నది.

'శివధనస్సు నెంతో కాలముంచి యీ విధముగా నీ సామర్థ్యము నెల్లరును గుర్తించునట్లు చేసినందున, ఆ భావమును మనసులో నిలుపుకొని మా జానకిని పెండ్లాడి అల్లుడవై ప్రత్యుపకారము జేసితివి. నీకెవరు గోరంత యుపకారము జేసినను దానిని కొండంతగా తలచుట నీ స్వభావముగా నున్నది. నాయనా! సీత నీ సహధర్మచారిణి. ఆమె యీ పదమును నిలుపుకొని నీకు వన్నెయు, వాసియు తీసికొని రాగలదు. మీరిరువురును గలసి లోకోద్ధరణ జేయ బూనుకొనుడు. వివాహములోని పరమార్థమిదే నయ్యా!

'నేనీ నాటి వరకు మా పుత్రి సీత, శివధనస్సును నీరెండు రత్నములను బహుయత్నముతో కాపాడుకొనుచు వచ్చితిని. వీనికి తగిన వాడవై యీ రెండిటిని నేడు నీవందుకొన్నావు. నా పంచప్రాణముల కిప్పుడెంతో ఆనందముగా నున్నది. నేనింత వరకు వీని రక్షణకై పొందుచుండిన సర్వవ్యథలు శాంతించినవి. నీవెప్పుడే పనిపై నైన నరణ్యమున కేగినను సరే, మా సీత నీ ముందుగా నుండి నిన్ను

రక్షించుకొనుచునుండును. నీ యరికాలిలో ముల్లు గ్రుచ్చుకొనినను ఏరి పారవేయు నయ్యా! రామయ్యా! ఇట్లు సీత నీ వెంట నీడవలె నుండునేగాని విడచి యుండదు సుమా!

'ఒక సత్యము జెప్పవలెననియున్నది. దానిని నేజెప్పినచో గొప్ప చెప్పి నట్లనిపించవచ్చును. అందుచే వెనుకాడవలసి వచ్చుచున్నది. కాని యధార్థము జెప్పక తీరదు కదా! రాఘవా! వినుము. మా జానకి నీ వెంట యున్నజాలును. నీ కీర్తి వైభవములు తిరుగులేనివై, లోకములకు శుభము కలిగించునవై యుండ గలవు. ఓ రఘురామా! ప్రతిపద గమన సుందరమైన కావ్యకన్యక వలె మా మైథిలి నిన్ను జేరినది. నాయనా! స్వీకరించుము. మీ కలయిక లోకములకు శాంతి కలిగించుచు. శుభోత్కరముగా నుండును. నవదంపతులకు దృష్టి దోషముల నుండి రక్ష కలుగునుగాక!"

ఆకాశము నుండి పూలవాన కురిసినది. మంగళ వాద్యములు మ్రోగినవి. వివాహమునకు వచ్చిన కన్యలు ఓరజూపులతో సీతారాముల జూచుచుండగాను, పురోహితులగు శతానంద వశిష్ఠు లాశీర్వదించుచుండగాను, విశ్వామిత్ర మహర్షి యాత్మతృప్తితో గడ్డము సవరించుకొనుచుండగాను, దశరథుడు సాటిలేని యానందము నందుచుండగాను మైథిలి రాఘవుల పాణిగ్రహణ మంగళము కన్నుల పండుగగా జరిగినది.



# ఊర్మిళ

'అదే అయోధ్య రాజలక్ష్మికి స్వాగతము పలుకుటకు సిద్ధమై యున్నది. ఎటు చూచినను పచ్చతోరణములే. కొబ్బరియాకులతో, అరటి చెట్లతో, వెదజల్లిన పూల వాసనలతో, జలకలశములతో నలంకరింపబడియున్నది. రేపటి దినమున శ్రీ రఘురాముడు రాజ్యభారము వహించుటకై సింహాసన మెక్కును; రాజ్యలక్ష్మి రాముని భుజమున నిలువనున్నది, అందుకే ఈ సింగారమంతయును. రాత్రియంతయు నిల్లాండ్రు ప్రమిదలలో దీపములు వెలిగించియుంచిరి. ఆ దీపతోరణము లెంతయో దూరము వరకు కనిపించుచున్నవి. నగరమంతయు నిట్లుండగా రాజ భవనముపై గల దీపము లెందుచేతనో గాని కొడిగట్టి కాంతిని కోలుపోయి, చీకటికి చోటిచ్చుచున్నవి.

రాజలక్ష్మి వెలుగులు చిమ్మవలసిన చోటున చీకటి కావురు క్రమ్మినది. దీనికి కారణము కనిపించదు. రాబోవు అనర్థమును సూచించుచు తోకచుక్క రాలినది. దైవము అయోధ్యా నగర సీమను దాటినట్లు కోటగుమ్మముపై రెపరెపలాడు జెండా జారినది. రాజు దశరథునికి తాను పూర్వము చేసిన దుష్కృత్యము గుర్తుకు వచ్చినది. దానితో రాత్రికి రాత్రియే రాముని యువరాజుగా జేయ తొందర పడినాడు. కొందరి కింకను ఆ కబురందనే లేదు. అతని ముద్దుల భార్య కైక తండ్రికి మాట మాత్రముగ యైన తెలుపలేదు. ఇది యేదో పన్నాగము కాదు కదా? యువరాజు కాబోవు రామచంద్రునకును, లక్ష్మణునకును మామయగు జనకుని పిలువ బంపనే లేదు.

యువరాజు పట్టమింత త్వరగా రాముని నుదుట గట్టుటకేమి పుట్టి మునిగినది? ఇందేదో స్వార్థము లేదు కదా? కానిచో నీ గుట్టెందుకు? ఎందుకో కాని కైకేయి బిడ్డ భరతుని దూరముగా వాని మాతామహుని ఇంటి కంపినాడు. ఆ మాట యనకూడదు. కాని, రాజు వానిని బిలువ పంపలేదు. కులగురువు వశిష్ఠుడేదో చిన్న రహస్యము రాజు చెవిలో నూదినాడు. రాజు దానితో నుండి పోయి, వెంటనే పురజను లందరిని పిలచి – అసలు సంగతి – రాముని యువరాజ పట్టాభిషేకమని తేల్చినాడు. వారును – ఈ వృద్ధ రాజిన్ని నాళ్లకు తప్పనున్నాడని సంతోషించినారేమో గాని – ఒక్క మారుగా – తథాస్తు అనినారు. శ్రీ రాముడును "తమ్ముడు భరతుడు రావద్దా" యని మాట మాత్రమునకైన ననలేదు. తండ్రి రాజ్యలక్ష్మి నిత్తుననగా – కాదనుట కర్హుడైనను కాదనలేదు. పామర జనులు రేపు రామస్వామి యయోధ్య వీధులలో నూరేగుచు రాగలడని సంతోషించుచున్నారు. వారు నగర మంతయు నలంకరించిరి. వశిష్ఠముని రేపటి యభిషేకమునకు కావలసిన సామగ్రి యంతయు వచ్చెనాయను సమీక్షలో నున్నాడు. రాముడు, మైథిలి తమ గృహదైవమగు రంగనాథుని బూజించిరి. కాని ముఖ్యురాలైన కైకకే ఈ వార్త తెలుపక దాచియుంచిన పర్యవసాన మెట్లుండునో?

ఈ వార్త నెవరో రహస్యముగ జిన్న భార్య చెవికి జేరవేసినారు. ఆమె యూరకుండునా? అందరకు దుఃఖము కలిగించక విడచునా? నామె చెవినూదిన వారు? మాటచేత, బుద్ధిచేత, రూపముచేత కూడ నామె కుబ్జయే. నూటికొక్క డామెను కూడ శుభంధర యని అనవచ్చును. అది యెంత నిజమో? మూడవ ముద్దుల భార్య మేడకు వెళ్లిన రాజింకను బయటకు వచ్చినట్లు లేదు. తెలవార నున్నది. ఏమో కాని వందిమాగధులా ద్వారము వద్ద నిలచి ప్రభుకీర్తిని బాడుట లేదు. వశిష్ఠ ఋషిని జూడనేగిన సుమంత్రుడును శుభవార్తను జెప్పనే లేదు.

తెల్లవారినది. పట్టాభిషేకోత్సవము జూడవలెనని ప్రజలెటు చూచినను గుంపులు గుంపులై మూగియున్నారు. అడుగో! వేగముగా నెవరికొరకో రథము

దోలుకొనుచు సుమంత్రుడు వెళ్లుచున్నాడు. రామచంద్రుడదే కైకేయీ భవనము నకు వచ్చినాడు. ఒకటే గుసగుసలు, చెవిలో జెవి పెట్టి ముఖ్యులైన వారు చెప్పుకొనుచుండగా, నసలు సంగతిని ప్రజలిట్టె గ్రహించినారు. ఇంత వింత లుండునా? శ్రీరాముడేమి? అడవులకు బోవుట యేమి?

రాముడు కైకేయీ భవనము నుండి కౌసల్యా సందనమునకు వెళ్లి తల్లితో తన మనసులో తాను చేసుకొన్న నిర్ణయమును తెలిపినాడు. 'తల్లీ! నాకు వనవాసము తప్పనిసరి. నీ పుత్రుని నమస్కారమిదే; స్వీకరింపుము' అని సాగిలపడి మ్రొక్కి తన గృహమునకు వచ్చినాడు. అతనితో కూడి వచ్చిన లక్ష్మణుడు ద్వారము వద్దనే నిలచినాడు. భవనములో సీత రాణి కళతో నున్నది. రాముడామెతో జరిగిన దంతయు జెప్పి, ఆ పై నేదో చెప్పగా సీత యది భావ్యము కాదని భర్తను హెచ్చరించినది. దానితో రాముడామె కోరిక నంగీకరించుట జరిగినది? మహాసాధ్వి ధర్మమైన కోరికను మన్నించి తీరవలసినదే కదా!

లోన జరుగుచున్న సీతారాముల సంభాషణ వాకిట నున్న లక్ష్మణుని చెవిలో బడకుండునా? వాని మనసులో నొక సందేహము కలిగినది. కన్నుల నీరు నిండినది. రాముడు తన సహధర్మచారిణి యగు సీతనే తనతో నడవులకు రానిచ్చుట నింతగా వ్యతిరేకించి చివరకెట్లో అంగీకరించెనే. ఇక తమ్ముడగు తనను వెంటవచ్చుట కంగీకరించునా? వానికి దుఃఖ మాగలేదు. అవి ధారలుగా ప్రవహించుచుండగా నన్న పాదములు గట్టిగా పట్టుకొని; వదినె చూచుచు వినుచు నుండగా తన్ను కూడ వనవాసమునకు వచ్చుట కంగీకరించుమని దీనుడై ప్రార్థించినాడు.

తన పాదముల బట్టి వదలని తమ్ముని లేవనెత్తి వాని ముంగురులు సరిగా త్రోసి కండ్లనీరు తుడిచి రాముడిట్లు చెప్పెను. 'లక్ష్మణా! వద్దని చెప్పినను వినకున్నావు. నాతో నరణ్యములకు రాదలచిన యెడల నీ యింట గల సుహృజ్జనుల అనుమతి యడుగుము. అందొకరినైన విడువరాదు సుమా! వారి

యనుమతితోనే అన్నియు జరుగును. అడవికి పోయి యచట పుట్టలపై నాడెద నన్నచో కట్టు కట్టుటకు నీయింట నొక గరుడ మంత్రమున్నదని మరువకుము'. రాముని హితవు వినుట వలన లక్ష్మణునికి ఊర్మిళ గుర్తుకు వచ్చినది.

రామానుజుడు భార్య ఊర్మిళ యొద్దకు వచ్చుచున్నాడు. ఇది నిజముగా నాశ్చర్యకరమే. రాత్రింబవళ్లు తామరపువ్వుల వలె నెఱ్ఱనగు రామచంద్రుని దివ్య పాదసేవ చేయుట తప్ప లక్ష్మణుడు వేరేమియు నెరుగని వాడు. అట్టి విరాగికి నేడన్నగారి మాటతో ఊర్మిళ గుర్తుకు వచ్చినది. ఆమె యింటనున్న విషయము తలపుకు వచ్చినది. భర్త యెచట నున్నను నేమిచేయుచున్నను ప్రేమనే ప్రదర్శించెడి ప్రేమ ప్రవాహ మూర్మిళ. అంతకు మించి మోహపు కెరటము లెరుగని సాధ్వియామె. అపూర్వ యౌవనవతి యగునామె యిన్ని నాళ్లును రామసేవకుని మరుగుననే పడియున్నది.

పచ్చని మేనిఛాయ, పాలవలె పొంగివచ్చెడి ప్రాయము, విచ్చిన తామరల వలె వేడుక గలిగించు కన్నులు, ముచ్చటగా మూగిన ముంగురులు కల ముఖమండలము, తన జీవితమున తొలి శుభమును కూర్చిన నాటి యూర్మిళ రూపము లక్ష్మణునకు జ్ఞాపకమునకు వచ్చినది. చెంపకు చారెడు కన్నులన్నట్లు విశాల నేత్రములు, గంపెడు తలవెంట్రుకలు, పిరుదుల బరువుచే నూగులాడు నడుము, మెరుపు వంటి శరీరకాంతి కల యూర్మిళ తలపుకు వచ్చినది.

కాని జితేంద్రియుడగు భర్తకన్న నామె జితేంద్రియ. పుట్టినింటి పెంపకములో సానలు తీరిన జాతిరత్నము. జనకుడు పెంచుటచే నామె జానకి కాలేదు. జన్మచేతనే జానకి యగుటచే అసలు జానకి యామెయే. కర్మయోగి యగు జనకుని సంతానమామే. అట్టి యూర్మిళ భర్తకు గల విషధాటికి లొంగునది కాదు. కోటేరు వంటి తిన్నని ముక్కు, శ్రీలొలికించు సన్నని నడుము, గులాబీల రంగును పుక్కిట బట్టిన చెక్కిలి, మన్మధుడు విజయయాత్రకై యెక్కిన విశాలమైన రథము వలె నున్న కటి భాగము – కావలసిన వారికివి యన్నియు సృష్టించియిచ్చుట యుక్తమే. కాని వీనితోనే ప్రయోజనము లేని ఊర్మిళ కివి యన్నియు ప్రసాదించిన బ్రహ్మను వెఱ్ఱివాడనక తప్పదు.

వచ్చుచున్న లక్ష్మణుని యూహలకు దొరకని దొకటియే – అది తన వనవాస మామెకు నచ్చునా? అంగీకారమగునా? రఘురాముడు తనకీ నిబంధన నేల విధించెను? సీతయు కైకయు స్త్రీ బుద్ధి యెట్లుండునో తెలుపుట కుదాహరణలుగా నుండగా, నూర్మిళకు మాటలే రావనుకొనవలెనా? పెద్దలు స్త్రీ బుద్ధి ప్రళయము కలిగించునని అందురు. కాని శ్రీరామచంద్రుడు దానిని నమ్ముటలేదు. నేనడవులకు వెళ్లి శ్రీరఘురాముని సేవలో నుందుననగా ఊర్మిళ 'ఊ' యనునా? అట్లు కానిచో నేమి చేయవలెను?

రాజ్యలక్ష్మికి దూరమై రాముడడవికి బోవుచున్నాడు, సన్యాసి వలె పోవుచున్నాడు. ఆపుకొందమన్నను రాముని స్థితికి కన్నీరాగుట లేదు. 'నేను నీ దాసుడను, నీ వెంట వత్తు' నంటిని. సరే, రమ్మనక నీ సహధర్మచారిణి యగు భార్యతో జెప్పిరమ్మని పంపినాడు. ఇది సాగునదేనా? 'భార్యను వదలి భర్త వనవాసము జేయరాదు. అది న్యాయము కాదు. మంచి పనియు గాదు. పెండ్లినాటి ప్రమాణము దప్పి నడచుట గొప్ప నేరము. అది క్షమించరానిది' అని మా వదినె సీతమ్మ యనినది. ఆమె చెల్లెలును నట్టి పట్టుదలయే జూపినచో రామచంద్రుని సేవ చేయుట యెట్లు పొసగును?

'భార్యనింట వదలి అడవికి వెళ్లిన భర్త పురుష రూపములో నున్న స్త్రీ' యని పెద్ద పిడుగువంటి మాటను విన్నాను. రాముని సేవ జేయదలచిన నాకీ గృహవ్రతము కాళ్లకు బంధము కాదుకదా?' అని దుఃఖముతో కన్నుల నీరు కార్చుచు, నడచునపుడు దారిలో పాదములు తొట్రుపడుచుండగా లక్ష్మణుడు భార్యయున్న యింటికి చేరెను. లక్ష్మణుడు వచ్చుచున్నాడను శుభవార్తను దాసి యూర్మిళాసతికి దెలిపినది. ఆమె తన ముఖ పద్మమున మూగియున్న తుమ్మెదల వంటి నల్లని ముంగురులను చేతులతో తొలగ ద్రోయుటచేత నాచేతి గాజులు ఘల్ఘల్లని మ్రోయుచుండగా గవాక్షపు తలుపులను విశాలముగా దెరచి వాకిటనున్న లక్ష్మణుని జూచినది.

హృదయము నుండి పొంగిన ప్రేమ ప్రవాహము తనను కుదిపివేయగా, గున గున మేడమెట్లు దిగి, మధురమైన యాలోచనలు బుసబుస పొంగగా, రాజహంసలకు నడకలు నేరుపదగిన చక్కని పద విన్యాసముతో నూర్మిళ భర్తకెదురు వచ్చినది. వచ్చి యతనికి అర్ఘ్య పాద్య ఆచమనముల నిచ్చినది. ఇచ్చి వెచ్చని ఆవుపాలలో చక్కెర గలిపి యందించినది. అందించి బంగరు పీఠమును స్వయముగా దెచ్చి వేసినది. వేసి దానిపై లక్ష్మణుని ఆశీనునిగా జేసినది. చేసి స్వయముగా చేత విసనకఱ్ఱను బట్టి శ్రమదీరునట్లు విసరుచు తియ్యగా పలుకరించినది.

'ఎంతటి సుప్రభాతము! ఏలిన వారికి నేడంతఃపురము జ్ఞప్తికి వచ్చినది. ఈనాడెంతో సుదినము; ఈ దాసి చేసిన జపము, తపము, పూజ అన్నియు కొంత మంచి ఫలితము నిచ్చినట్లున్నవి. మీయంత మీరే యిచటికి విజయము జేసినందుకనేక నమస్కారములు. శ్రీరఘురామచంద్రులవారి యౌవరాజ్య పట్టాభిషేక వార్త నిన్ననే తెలిసినది. ఇంతలో శ్రీవారిటు విచ్చేసినారు. శుభములపై శుభము లీ దాసురాలి వైపు అమృతపు కెరటముల వలె ప్రవహించుచున్నవి. ఇంకేమి కావలెను?

'రామరాజ్య పట్టాభిషేకము జూడవలెనను కోరికతో వచ్చిన వారికి పేరు పేరున నర్ధరాత్రి వరకు మర్యాదలు జరుపు కార్యదీక్షతో నిద్రలేనట్లున్నది. ఔరా! అట్లు స్వామి సేవలు జరుపు మీరెంత పుణ్యాత్ములు! తాము జన్మ చేతనే భోగులు (శేషులు). రాత్రింబవళ్లన్నగారిని చుట్టుకొని ప్రాకులాడు చుందురు. పాలను, విషమును సమానముగా పరిగణించగలవారు. పుట్టలైనను మేడలైనను తమ వంటి వారి కొక్కటే. అట్లు భోగులైనను యోగులైనను కాగలరు. పవనామృత మున్నచో చాలును (పవనమనగా గాలి, సర్పములు గాలి ఆహారముగా జీవించగలవని ప్రమాణము).

'ఊర్మిళా! లక్ష్మణుడు లక్ష్మీ సంపన్నుడు, భగవంతుని, ఆచార్యుని పాదముల సంసేవనయే నీమగనికి శోభనిచ్చుచున్నదని మా తండ్రి జనక మహారాజు

నన్ను మీకిచ్చెనని సంతోషింతును. మీయన్న వలె మీరు పెద్ద వింటిని విరచితిరని నన్నీయలేదు. మీరు ప్రదర్శించుచుండిన శేషత్వ (సేవా) భావమే మనసుకు నచ్చి నన్నిచ్చినారు. ఎవరే మనుకొన్నను భగవానుని అనుసరించి మెలగుటయే మాకు నచ్చిన విషయము.

'మీరో గొప్ప విరాగులు. మిమ్ములను మించినది మీ తల్లియు మాయత్తయు నైన సుమిత్రాదేవి. మీ యిరువురి పద్ధతియే వేరు. మీ మార్గము లితరుల దారులవంటివి కావు. మీరెంతటి వియోగమైన నోర్చుకొనగలరు. వీసమైన మమకారముండదు. కనుక మానవాతీతులైన కారణజన్ములు. మీతల్లి సుమిత్ర. ఆమె నిజముగ నందరకు సుమిత్రయే (మంచి స్నేహితురాలు). నిర్మలమైన మనసుతో పతి సేవజేయును. ఒకటికి రెండుమార్లు బంగరు గిన్నెతో పాయసము బుచ్చుకొనును. మిగిలిన సవతులవలె కాక ఇర్వురు పుత్రులను కన్నను ఆ యిల్లాలు మీ తండ్రిగారి యిల్లాండ్రందరిలోను ముత్యము వంటిది.

'జన్మించిన ఇద్దరు కొడుకులలో పెద్దయైన మిమ్ము మీయన్న శ్రీరామస్వామి చేతిలో పెట్టినది. వారితో నాయనా! నీసేవలో వీనిని తరింపజేయు మన్నది. అట్లే మరొక సవతి పుత్రుడు భరతునికి తన రెండవ బిడ్డ శత్రుఘ్నుని అర్పించినది. పెట్టిన పేరుకు నడవడిక సరిపడియున్నదని అనిపించుకొనుట యెంతటి వారికోకాని ప్రాప్తము కాదుకదా! ఏనాడును ఆమె ఏ పుత్రుని పిలువదు ఏ పుత్రుడు ఏ సవతి తల్లి పుట్టింటికి వెళ్ళినను, ఏ కొడుకేయడవికి వెళ్ళినను ఏ మమత అనుబంధము చూపక 'శుభము, వెళ్ళి సుఖముగా రావయ్యా!' అని దీవించి పంపుచుండును. ఇట్టి సుమిత్రకు ఈ లోకములో సమాను లెవరుందురు? ఏ పుత్రుని ఏనాడును ఆమె పిలువదు, కోడలి కాపుర మెట్లు సాగుచున్నదో విచారించదు. భర్తయే సవతియింట నున్నను తప్పు బట్టదు, గడబిడ జేయదు. మమకార పాశము మెడకు దగిలించి లాగుట నామె యెరుగదు. సుమిత్రను మించిన సాధ్వీమణి లోకములో వేరొకతె కనిపించదు.

'ఆ మహనీయురాలి స్వభావమది. మామగారామెకు పాయసము కొంచె

మిచ్చినారు. తృప్తినందక మరికొంచె మిచ్చినారు. ప్రేమను మాటలతో చెప్పక పోయినను చేతలు వెల్లడించును కదా! ఆమెయు తన సంతానమును దేవతా ప్రసాదముగా దలచి ఒకరిని భగవత్సేవకును, మరొకరిని భాగవత సేవకును అర్పించినది. ఆ తల్లి గుణములే పుత్రులకును వచ్చినవి. ఊర్మిళ భర్తకొరకెదురు చూచుచు గుమ్మములో నిలబడి యున్నను, రెండవ కోడలు సవతి పుత్రుని యింట తన యక్కతో పడియున్నను, సుమిత్రాదేవి సరే, తామును, అదేమి యనరు. ఎంతటి విరాగమో కదా!

'స్వామీ! మీ కండ్లలో నీరు నిలచినదేమి? రేపటి పట్టాభిషేక సమయమునకు మరిదిగా రిచట లేరనియా? మీ సవతి తల్లి కుమారులు భరతుల వారిచటికి రాలేదేమను విచారమా? మీ మనసులో నంతటి అనురాగ బాంధవ్యములున్నచో వేరేమి కావలెను? ఎప్పుడో ఒకప్పుడు ఈ యూర్మిళయు తరించిపోగలదు. మీ తండ్రిగారు గృహప్రవేశ వేడుక నిమిత్తమై మిమ్ములనిచటికి పిలిపించినప్పుడు నేను బాలికను, పైగా క్రొత్త పెండ్లి కూతురును. ఆనాటి క్రొత్త సిగ్గుచే మిమ్ములను ముందుగా పలుకరించలేక పోయితిని. నన్ను జూచుటకు మీరును ఉత్సాహము జూపక పోయితిరి. నాకానాడు కనిపించుట - మరలనిదే మీ దర్శనము. ఏమి చేయగలను?

సరే! ఆనాడు గడచిపోయినది. ఆ మరునాడే దాసిని చూడ రాకూడదా? తమకొరకెదురు చూచి చూచి కండ్లు వాచిపోయినవి. ఈ మేడపై చివరి భాగమున నిలచి మీకొరకన్నివైపుల జూచితిని. అదెంతటి రామచంద్రుని దాస్య సుఖానుభవమో? రఘువంశ స్వామి సపర్యతో తమ కాలమంతయు గడచిపోవుచున్నది. మీ మనసులో నూర్మిళ విషయము జ్ఞాపకము లేనే లేదు. అదేమియో కాని ఈ వేళ నింత దయ కలిగినది. ఇంతకును మీయన్నగారి ధర్మమాయని ఇన్నాళ్ల కిచటికి విచ్చేసితిరి.

'ఇంతటి వైరాగ్యముకల మీకీ కన్నీరెందుకు? దీనికే కారణమును కనిపించదు. రామ పట్టాభిషేక సమయము కనుక సోదరులు భరత శత్రుఘ్నులు

జ్ఞాపకమునకు వచ్చెదరు. శుభసమయములో నాప్తులు దగ్గర లేకుండినచో బాధగానే ఉండును. మీ కొరకు నేనును మనసే ఇల్లుగా జేసుకొని, అందులో పుట్టెడు భావములను నింపుకొని వాకిటిలో నిలబడి స్వామీ! మీ కొరకిన్ని సంవత్సరము లేదురు చూచితిని. నా మూగ బాధ, మధుర ప్రణయములో తృప్తినందని నా కోరికలు – లోకమున కేమి తెలియును? భర్త ప్రేమదృష్టి పడని మనసుకు శాంతియుండునా?

'దూరమున నున్న భరత శత్రుఘ్నులు తెలవారు సరికి రాలేరు కదా? దీనికొరకు విచారమా? ఎంత బలమైన కారణమున్నను ధీరులేమాత్రము విచారము పొందరు. ఇది ధీరతా లక్షణము. ఒక సందేహము వెల్లడి చేసెదను, నా పై కోపగించరు కదా? ఈ రోజు రామస్వామికి మహారాజు రాజ్యమిచ్చు చుండగా – మీ సోదరుడా రామచంద్రునిపై మీ విషపు చూపు పడినట్లున్నది. అదే నిజమై యుండును. మీబాధ యర్థమైనది. జ్ఞాతులకుండు అసూయ కలిగినది. ఇది తగునా?"

ఊర్మిళ పలికిన చివరి మాటలు వినినంతనే లక్ష్మణుడు 'హా! ఊర్మిళా! అది కానే కాదు' అని గద్గద కంఠముతో పలికి తన చేతిని ఊర్మిళ నోటిపై నుంచి 'ఆపుము, నీ కఠోర వాక్యమును, పిడుగుల వంటి యీ మాటలను నా మనసు ఓర్చుకొనలేదు. నీకిట్లనుట తగదు. నా స్వభావమును గుర్తించక లేనిపోని అపోహలను నా తలకు జుట్టకుము. వజ్రపు దెబ్బలవంటి ఎంతటి తీవ్రమైన మాటలంటివి?

'ఊర్మిళా! రాముడు యువరాజగుచుండగా సహించలేని దుష్టుడనా? ఇట్టి చెడు మాటలను అనలేను, వినలేను. ప్రేమతో జాలితో రచించిన రామకథకు విద్యాగంధములేని జడుడెవడో వ్రాసిన సమీక్షగా నా హృదయ భావనలను పరిగణించినావా? ఈ శుభకార్యమును కాదనువారు లేకపోలేదు. ఉన్నారు, నా పరితాపము ఈ శుభకార్యమునకు నా సోదరులు రారని కాదు. నా వేదన

నీకెట్లు చెప్పుదునా? యను సంశయము నన్ను ఉక్కిరి బిక్కిరి చేయుచున్నది. చేదు విషము వంటి సమాచారమును విని ఓర్చుకొనుదువేని జెప్పెదను.

ఊర్మిళా! మునుల మాటయేమో? చెప్పలేను. కాని, మనుష్యుల మధ్య ప్రేమానురాగము లన్నియు ధనమూలకములుగా నున్నవి. ఐశ్వర్యము లోభ పెట్టుట సత్యమే – దీనికి ఋజువు కైకేయి మూలముగా నేడు కనిపించుచున్నది. సుఖులని సంతోషులని కొందరి పేర్లు పలవరించు చుందురు. నిజమైన ఆనందమునకు ధనము ప్రధానము కాదు. సిరిసంపదలు నీటి బుడగల వంటివి. వీనిని తలచినంతనే మనసుకు రోత కలుగును. అట్టి సంపదల కొరకు లోకనిందనైనను భరించువారున్నారు. వారు ఇంట సుఖముగా నున్నారన జాలము. కాని ధనము సఖ్యతను దూరము జేయుననుట మాత్రము సత్యము.

ధన మూలమున నడచు దారులు వేరగును. ప్రేమ హృదయములలో ననుమాన పిశాచము నివాసమేర్పరచుకొనును. ధనముపై నాశ వదలనిదే మనశ్శాంతి కలుగదు. ధన ప్రభావముతో సద్బుద్ధి, దైవము దూరమైపోవును. ఇట్టి ధన పిశాచము అయోధ్యా సింహాసనపు ఎదుట తల విరియబోసుకొని తైతక్క లాడుచున్నది. ఇక కలియుగమే వచ్చినచో దాని తాండవమెట్లుండునో! ఆనాడు దీనినెట్లు భరించెదరో తెలియదు. కాని నేడయోధ్య దీని నిమిత్తము కుతకుత లాడిపోవుచున్నది. ఊర్మిళా! ఈనాడు జరుగవలసిన దంతయు నిట్లు మారిపోయినది.

'ఇది యీనాటి మాటకాదు. చాల యేండ్ల నాటి పాత కథ. శంబరాసుర యుద్ధమునకై మా తండ్రి వెళ్లుచుండగా మా సవతి తల్లి కైక కూడ వెళ్లినదట. అవసర సమయములో తన భర్త కపాయము కలుగకుండగా నామె రథము నొక ప్రక్క కీడ్చినదట. యుద్ధమునకు వచ్చినందుకొకటి, తనను ఆపదనుండి యుద్ధరించినందు కింకొకటి – మా తండ్రి యామెకు రెండు వరములిచ్చి, యవి తన వరదానములని, ఆమె వానినెప్పుడు కోరిన నప్పుడే వానిని ప్రదానము

జేయుదు ననియు మాట యిచ్చెనట. అవి యామె దాచనిచ్చిన ధనమట. కోరిన నాడవి యీవలెనట. కాదనుట కెవ్వరికి నెట్టి యధికారము లేదట.

'ఊర్మిళా! అసలు విషయము జెప్పుటకీ ద్రావిడ ప్రాణాయామము, అప్రస్తుత ప్రశంస యెందులకనగా, నసలు విషయమును సూటిగా జెప్పలేకనే. ఆ వరముల ఫలముగా కైక మాయన్న రాముని పదునాలుగేండ్లడవిలో నుండు మనెను. ఆ కాలమున భరతుడు పీఠమెక్కి పాలించునట. రాజు 'ఊ' అనినాడు. ఆమె యీ కార్యము వెంటనే జరుగవలెననినది. దీనిని మాయన్న రాముడంగీకరించి తల్లి కౌసల్యతో జెప్పి తరువాత తన ఇంటికి వెళ్లినాడు.

'మా వదినె సీత మాత్రము దీనికి సమ్మతించలేదు. తానును మాయన్నతో వనవాసము చేయుచు దారిలో ముళ్లు దర్భమోళ్లు లేకుండ మార్గము సుగమము జేయుచుందుననినది. రాముడంగీకరించ లేదు. సీత ప్రణయాభిమానముతో నేవేవో పిడుగుల వంటి మాటలనినది. వానికెదురు చెప్పక చివరకు రాముడామెను తనతో వచ్చుటకు సమ్మతించినాడు. ఆ సమయమున నేను వాకిలి కావలిగాయుచుండి నందున వారి సంభాషణ నా చెవుల బడినది. తరువాత సంగతి జెప్పెదను. అందులో సగము మాత్రమే నాది. మిగిలిన సగ బాధ్యతయు నీదే.

'ఊర్మిళా! మాయన్న రామచంద్రుని విడచి నేనొక క్షణమైన నుండలేననుట నీకు పూర్వమే తెలియును. పసిపాపలమై పాలుత్రాగు వయసు నుండియు రాముడును నన్ను వదలి యుండలేదు. నాతో కలసి పరుండియే రామస్వామి సుఖనిద్ర పోయెడివాడు. ఈ మా యనుబంధము నేటిది కాదు. ఏ జన్మల సంబంధమో. దీని కాధారము తెలియకపోవచ్చును. ఈ యాత్మీయత మాయ యెరుగనిది, మచ్చలేనిది, మనోహరమైనదియును. బహిః ప్రపంచమున కతీతమైన దేదో ఇందున్నది. రాముడు నిద్ర లేచుసరికి సర్వ ప్రథమముగా

నేను కనిపించవలెను. నిద్రకైనను, నోట అన్నపు ముద్ద పెట్టుకొనుటకైనను, నీరు త్రాగుట కైనను నేనెదుట నుండి తీరవలసినదే.

ఇపుడిది యొక పెద్ద సమస్యయై పోయినది. ఇటువంటి సోదరుని నేనెట్లు వదలుట? ఆనాడా విశ్వామిత్ర మునివరులు తన యాగ రక్షణ కొరకన్నగారినంప గోరిరి. కాని రామచంద్రుడు తన వెంట నన్నును రమ్మని పిలచెను. ముని ఆకలిని దాహమును పోగొట్టు బలాతిబలలను విద్యలను రామున కీయగా వానిని మాయన్న నాకిచ్చెను. ఇట్లు ప్రవర్తించు అన్న రాముడు కాక కోటి కొకడైన నుండెనా?

'ఊర్మిళా! అతనిని కేవలమన్నయని అనరాదు. పరంధాముడని పేరొందిన దేవుడే అనవలెను. అస్త్ర విద్యలుపదేశించుటచే నాచార్యుడును, నా జీవిత సాఫల్యత కొరకు వానితో నేనును అరణ్య భూములకు పోవుచున్నాను. ఇది నా నిశ్చయము. అన్నకు వదినెకు నడవులలో తృప్తి దీరునట్లుగా రెప్పపాటులేక గాలినే భుజించుచు నేమరుపాటులేక సేవ జేయుదును. నాకు గల శేషవృత్తి యిన్నినాళ్లును నీ అయోధ్యలో మట్టిలోని మాణిక్యము వలె నదృశ్యముగా నున్నది.

'నేను రామునకు దాసుడను. నాగతి దాస్యమే. ఆ రామప్రభువు నన్ను ఆవాసముగా కాని, పాదుకగా కాని, శయ్యగా కాని, ఆసనముగా కాని, వస్త్రముగా కాని వాడుకొననిమ్ము. ఊర్మిళా! నాకు సంతోషమే. భోగములతో నింతవరకు నేది సంబంధమున్నను నది యీనాటితో పోయినది. కాని శేషత్వ వాసనయు రాముని వెంట ప్రాకుటయు వదలుకొనజాలను. కారడవులలో పార, గొడ్డలి, పెట్టె, గంప మున్నగు సాధనములను ధరించి సేవకావృత్తితో ముందుగా నడచుచు నాదంపతులకు దారి చూపుచుందును. పండ్లు, దుంపలు, వేళ్లు మొదలగు వానిని వారికాహారముగా సమర్పించు చుందును. నాయాకాంక్ష దీరునట్లు మనఃపూర్తిగా నన్ని సేవల జేయుచుందును.

'ఊర్మిళా! నిండు మనసుతో రాముడు ధరించు పెద్దవింటి నందుకొని

భుజముపై మోయుచుందును. దాస్య రసమును పూర్ణశక్తితో రెండు చేతులతో పిండెదను. వేయి ముఖములతో కనిపెట్టి యుండెదను. ఇందుకొరకై నేటివరకు నాకు గల భోగములనెల్ల వదలివేసితిని. స్వర్గము వద్దు. బ్రహ్మపదమును తలపను. మోక్షమను మాట వినను. భోగములు అక్కరలేదు. కుటుంబ ప్రసక్తి తీసుకొని రాకుము. స్వరూప సిద్ధమగు రామస్వామి సేవకు మించి వేరేమియు నక్కరలేదు. ఊర్మిళా! అడవులకు వెళ్లదలచుచున్నాను.

సర్వకాలములందును సర్వావస్థలయందును నేనార్య రామచంద్రునకు శేషుడను. అన్న వదినెలకు స్వరూపసిద్ధియగు కైంకర్యము చేయుచుందును. నా యీ పనులు నీకు సమ్మతి కలిగించున వైనచో నంగీకరించుము. భార్య కంగీకారముకాని పని భర్తకు జెడు కలిగించును. ఊర్మిళా! ఎంత వేడినను రాముడు నా వనవాస ప్రస్తావన త్రోసివేసినాడు. నా కోరికను కాదనినాడు. జానకీదేవి చూచుచుండగా నా బాధను రామునకు నివేదించితిని, ఏడ్చితిని, పాదములపై బడితిని. నాకు మార్గమేమి యంటిని. అంతట రాముడు నీ యనుమతి అడుగ బొమ్మనినాడు.

'విషయములన్నియు విమర్శించి చూచి, నీవు మంచిమాట జెప్పుము. మీయక్క జానకీదేవి వలె నీవును వనవాసమునకు బయలుదేరెదవేని నాకు కలుగు కష్టముల జెప్పతరము కాదు. నాకు శ్రీరామ సేవ జేయుట సాధ్యపడదు. రామచంద్రుడు ప్రభువు. నేనాతని దాసుడను. ప్రభువు తన వెంట తన భార్యను తీసుకొని వెళ్లవచ్చును. అది వానికి జెల్లును. కాని వాని దాసునకెట్లు చెల్లును? ఈ పదునాలుగేండ్లు మనమిద్దరమును రఘురాముని సేవకై యోరిమి వహించి దూరముగా నుందము. కాదనకుము. మనోనేత్రములతో మనమొకరినొకరము చూచుకొనుచుండ వచ్చును. దీనికే యభ్యంతరము నుండదు. నీ స్వచ్ఛమైన ప్రేమను నేనెంతో ప్రశంసించు చున్నాను.

'నీవు అనవసర భావనలతో క్రుంగి నా మనసు పాడుచేయకుము. నీవు

కర్మయోగియగు జనకుని కన్నకూతురవు. కనుక మనసులో మమతాను బంధములు పెంచుకొనకుము. నీకు దెలియని విషయములు లేవు. మాయన్న నీ యనుమతి కొరకు నన్నంపినాడు. ఊర్మిళా! కాదనకుము. నేను క్షణము కూడ రఘురాముని జూడక నిలువలేను – ఆ సంగతి నీకు దెలియును. దశరథ ప్రభువేమైనను కానీ, అయోధ్య యెట్లున్నను ఉండనీ, పరాయి ప్రాంతములలో మాయన్న కష్టములు పడుచుండగా నేనింట నుండి భార్యతో విలాస భోగములంద జాలను.

'ఆ ప్రభువు పాదపద్మముల సమీపములో రాత్రింబవళ్లు – తమ్మునిగా కాక – రామగుణదాసుడనై కొంత సేవ చేయుచునుండనిదే శేషత నిలువనిది నా యీ స్వభావము. ఇది జన్మతోనే స్వరూప సిద్ధముగా వచ్చినది ఊర్మిళా! నన్నిది వదలదు. మాయన్న మనకందరికి శుభకారకుడు. పిన్ననాటనే తాటకను చంపెను. ఆమె పుత్రులలో సుబాహుని జంపెను. గురుశ్రేష్ఠుడగు కౌశికునిపై గల గౌరవముచేత అహల్య శాపమును పోగొట్టెను. జానకి చూచుచుండగా శివధనస్సును భంగపరచెను.

'ఊర్మిళా! రాముని సేవ చేయనిదే ఈ శరీరము వ్యర్థము. శేషత నిష్ఫలము. ఇల్లు, భార్య, జన్మము వృధా. కనుక నా విన్నపమున కంగీకరించుము' అని లక్ష్మణుడు కండ్ల నీరు ధారలుగా కారుచుండగా ఊర్మిళ పాదములపై బడనుండగా నామె తన పైట జారుచుండగా కటిభారముచే నడుము తడబడు చుండగా "అయ్యో! లెండు లెండ"నుచు, తన చల్లని చేతులతో భర్తను లేవదీసినది. బంగారు పీతముపై గూర్చుండ బెట్టినది. కన్నుల నీరు దుడిచినది. విసనకఱ్ఱ చేతబట్టి విసరుచు – శాంతముగాను, గంభీరముగాను, మనసును తాకునట్లుగాను, ఆశ్చర్యకరముగాను, చెవులకు బండువగాను, లోకములకు మేలు కలుగునట్లుగాను, శాంతికలుగునట్లుగాను, దాపరికము లేకయుండు

నట్లుగాను, అంతకంటే విలక్షణముగాను, కొంత మందలింపుగాను, కొంచెము ప్రణయ కోపముతోను లక్ష్మణునితో పలికినది.

'స్వామీ! ఈమాత్రమున కింత విచారమెందుకు? మీయన్న గారి చేతికందనున్న రాజ్య వైభవము తప్పిపోయిన దనియా? వారితో వెళ్లుటకు నేనొక యాటంకముగా నున్నానను భావము చేతనా? ఇది యందరకు తెలిసినదే కదా! దీనికింత దాపరికమెందుకు? మీయింటికి కోడలిగా వచ్చి ఏండ్లు గతించిపోయినవి. చూచిన వారు, వినిన వారు – 'పాపము! పాముకు పాలు పోసినట్లు లక్ష్మణునకు ఊర్మిళనిచ్చినా' రని నారు. ఇది మీకొక మచ్చయేకదా! ఈ విధమైన మచ్చను మాయక్క సీతకును మీయన్నగారెపుడో ఒకప్పుడు ఈయక మానరు.

'ఒకమారు చూడుడు – కస్సుబుస్సుమనక ఆలకించుట యుండదని – మీ నడవడిక గూర్చి మీ నాన్నగారే అనియున్నారు. నేనప్పుడు సిగ్గుచే వారియన్ని మాటలు వినియుండ లేదు. మీయింట ప్రతి కోడలికిని నేదియో ఒక లోపము ఎప్పుడో ఒకప్పుడు కలుగక మానదు. సీతారాములకు సేవచేయుచు నుండు మీచేత ఇప్పుడు చిత్రముగా తాకబడితిని. ఇంతయే చాలును లెండు. నా మనసు కొంచెము చల్లబడినది. జీవితములో నీమాత్రపు తృప్తి కలిగినది. ఇంక నితర సంగతుల కేమిలెండు. అట్టి యదృష్టము లెంతవారికో చెప్పజాలను.

'ఇంత బాధ యెందుకు? ఇన్నాళ్లకీ విధముగా దారితప్పి, అన్నగారి బలవంతపు టాజ్ఞచే నీ యిల్లాలిని చూచుటకై విచ్చేసినారు. ఎట్లైనను వచ్చినారు. మీ స్వరూపమే కదా! అందుచేత నే స్త్రీయు మిమ్ము పెండ్లాడి సుఖమంద జాలదని జ్ఞాపక ముంచుకొనుడు. అరణ్యయాత్రపై మీకెంతో కుతూహలమని తెలుసుకొని, కైక రాజుగారిని కోరియుండును. ఇది మీకానందము గూర్చు విషయమే కదా! మరొక రహస్యమున్నది. ఈ దాసురాలు చెప్పినచో బుస్సుమనరు కదా? చెప్పినచో నది మీచెవిని బడునా? చూపునకే వదిలివేసెదరా?

'అది మీ తండ్రిగారు ముచ్చటయైన మూడవ పెండ్లికి అట్టహాసముగా వెళ్లిన నాటి ముచ్చటయట. కైకకు మీ తండ్రిగారికి ఈడా? జోడా? యని వారు పిల్లనీయమని అనినారట. దానిపై కైక కుమారునికే రాజ్యమిత్తునని మీ తండ్రిగా రన్నారట. భర్తను సత్యసంధుని జేయుటకే కైక యీ కోరిక కోరినది. మీ తండ్రి సత్యమార్గమును వదులకుండు నట్లు వరము కోరి ఆమె మీ పరువు నిలిపినది. ఆడిన మాట దశరథుడు తప్పడను ప్రసిద్ధి మీ తండ్రికి కలిగించుటకే ఆమె యీ కోరిక కోరినట్లు కనిపించుట లేదా? ఇది క్షత్రియ ధర్మము కాదా? రాజ్యలక్ష్మి మీయన్న చేతిని ఇదివరకే వదలివెళ్లినది. దానిని భరతునకు కూర్చవలెనని పైకి పోరాడుచున్నట్లు కనుపించుచున్నది. ఎవరేమనినను కైకది మంచి యూహయగుట చేతనే తన యరణ్యావాసమునకును, భరతుని పట్టాభిషేకమునకును రాముడు ఔననక తప్పదు.

'భరతుడు దగ్గర లేనప్పుడు శ్రీరాముని కభిషేకము జేతునని పురజనులను పిలిపించి తమ చెడు తలపును వారి నెత్తికి రుద్దెడు పనికి మీ తండ్రిగారు సిద్ధపడినారు. ఇది తగిన పనికాదని కైకమ్మ తన భర్తనిట్లు దారికి దెచ్చినది. దశరథుడు పలికి బొంకని వాడను పొగడ్త మీ తండ్రికి కలుగుజేసినది. రాముడు కైకేయి పాదములపై బడి తమ్ముడు భరతుని పిలిపించుమని కోరుచుండగా నామె రేపు రేపని జరుపుచు 'నాయనా! రామా! వాని మాట మరచిపోయితిని. నీవు నా పుత్రుడవు కావా? ఎప్పటికైనను నా పేరు నిలుప గలవాడవు నీవేరా!" అనుచుండెడిది కదా!

'నాయనా! రామచంద్రా! మనల నందరను వదలి భరతుడు మామల వెనుక నక్కినాడు. వానికి నేను తల్లినా? లేక లేక పుట్టినను మాకచ్చట ముచ్చట తీర్చుటకైనను రాడు. మమ్మ్మజూడ రాడు. వాడు మమ్ము చూచినను చూడకున్నను నెప్పుడో యొకప్పుడు తిరస్కరించి మాపై నెపములు పెట్టునేమో! రామా! అట్టి దశయే ప్రాప్తించినచో మమ్ములను కనిపెట్టి యుండుము. తల్లిదండ్రులను

వదలి తాతల పంచ జేరిన నా బిడ్డ వీధి వీధికి నింటింటికి దిరిగి, పేరు పేరున జనులను పలుకరించి, వారి యోగక్షేమములు కష్టసుఖములు అవసరములు తెలుసుకొని వాటిని తీర్చగలడా? ప్రజలకు అనుకూలముగా నడుచుకొనువానికే గాని, వేరొకనికి రాజ్యమెందుకయ్యా!

'దుఃఖపడెడి పురజనుని బాధకంటె, వానిని చూచినచో నీకు కలిగెడు దుఃఖమే యెక్కువ. ఏ యింటి వాకిటిలో శుభ సూచకముగ తోరణము కట్టినను ఆ యింటి యజమాని పొందు సంతోషము కన్న నీవు పొందెడి ఆనందమే యెక్కువ కదా! తండ్రీ! రామచంద్రా! నీ నిజచరిత్రను లోకమంతయు తెలుసు కొనునులెమ్ము. రాజబాటలో నదిగో రాముడు రథముపై వచ్చుచున్నాడని పుర స్త్రీలు నిన్ను జూడవచ్చునంతలో వారిని జూడనీయక వారేదో దోచుకొనిపోవుదు రన్నట్లు లక్ష్మణుడు రథమును వేగముగా దోలుచు వారిని వంచించును. సుమంత్రుడు వెల్లగొడుగు నీడలో తామరపూవువలె స్వచ్ఛముగా నున్న నీ ముఖమును దాచివేయును నాయనా! వారికివి తగవని వారితో జెప్పుము అని చెప్పుచుండెడిది.

'దాతవై దీనులైన వారిని, ధర్మయుక్తమైన మాటలతో జ్ఞానులైన వారిని ఆదరించుచుందువు. మంచి ఆదరణతో ఆశ్రయించుకొనియున్న వారిని ప్రాణముగా జూచెదవు. ఇట్టి సత్పురుషుడవు – నీకు నా మూలమున నేవిధముగా నైనను లోకమంతయు ప్రశంసించెడి కీర్తి కలుగవలెను. చిన్నదొరా! నీయభిషేక వార్త విను కోరికతో నిత్యము మీ తండ్రితో పోరు పెట్టుచుంటిని. ఆ శుభము నికనెంత మాత్రము నాలస్యము జేయక వేగమే జరిగించవలెనని జెప్పితిని. మేము పోగొట్టుకొన్న రాజ్యముల నెల్ల మాకెప్పుడు జయించి యిత్తువయ్యా, రామయ్యా! అని కైక ప్రేమతో రాముని బుగ్గలు దువ్వెడిది కదా!

'మీ సోదరులు నల్వురికి మేము ముగ్గురము తల్లులమే – ఎవరి బిడ్డ ఎవరను విచక్షణ అక్కరలేదు – అని కైకేయి ప్రేమజూపెడిది. ఇది కైకమ్మ

రహస్యము. లోకులు కాకులు, వారికి రహస్యము తెలియదు. రామా! నీయందు నూరు తప్పులు చేసిన వానినైనను, నిన్ను నోరు నొచ్చునట్లు దూషించిన వానినైనను అవి యేవియు మనసున నుంచుకొనక శరణన్న కాపాడువాడవు. ఔరా! నీ ఓర్పెంతయో కదా! నీ సద్గుణములు లోకులందరు గుర్తింపవలెనని కోరుచుంటిని. ఆ శుభఘడియ గుమ్మములోనికి వచ్చినదని కైకమ్మ యను చుండుటను మీరు వినలేదా?

'స్వామీ! రాజ్యమిప్పుడు భరతున కిచ్చుటయు, మీయన్న రాము డరణ్యమునకు వెళ్లుటయే తగిన పని. కైకమ్మ విధించిన పదునాలుగు సంవత్సరముల గడువు ముగిసిపోయిననే గాని లోకమున శాంతి స్థాపన కాదు. ఎవరు ఎవరికి ఏయే వరములు ఎన్ని ఇచ్చియున్ననూ వాటిని పాటించవలసినది మీ యన్న రామచంద్రుడే కదా! భరతుడు రాజై పాలించుననుట వట్టిమాట. కాని రాముడు సీతతో కూడ అడవులకు వెళ్లుననుట మాత్రము నిజము. సీత పతితో కలిసి యడవులకు పోవునని, ఇది తప్పదని మహాత్ముడొకడు చెప్పుట నేనెరుగుదును.

'మా యక్క సమాచార మీ విధముగా మీ యొద్ద జెప్పెడు నదృష్టము నాకు కలిగినది. మీ యన్న కంటె సీతయే లోకమున ప్రసిద్ధి పొందును. పూర్వ జన్మమున నామె పంతము పట్టి భూమిలో దాగియుండి మా తండ్రి కంటబడినది. ఆ యోగినియే నాగటి చాలులో మా తండ్రికి దొరకి సీత యైనది. అట్లు అయోనిజయైనది. ఆమెనే మా తండ్రి జనక మహారాజు 'నా సుగుణాల రాశి, నా కుమార్తె, నా కులోద్ధారకురాలు, నా యింటికి అతిథిగా వచ్చిచేరిన భాగ్యలక్ష్మి', యని పిలచుచు మురియుచుండెడి వాడు.

'మా సీత చర్యలమానుషములే కాదు, అద్భుతములు కూడ. ఆమె వానిని ప్రదర్శించుచుండగా మా త్రండి 'ఇదియేమి? ఈమె యెవరు? ఎంత విచిత్రము! ఇంత పెద్ద విల్లీమె తన మెత్తని చేతులతో నెట్లెత్త గలిగినది! బాలిక యోగ

మాయయా? కానిచో నెవరై యుండును' అని రోజుకొక విధముగా నబ్బుర పడుచుండువాడు. నేనాయన కన్నబిడ్డనైనను, ఆమెనే ప్రథమురాలిగా జూచెడు వాడు. క్రమముగా నా పేరునే మరచెనేమో? సీతా! యని పిలచెడువాడు. ఎవరెందరున్నను హరిపూజకు పాలు పండ్లు పువ్వులు తులసీ దళములు సీతయే తెచ్చి యీవలెను. అదేమి మమకారమో! మా తండ్రికి సీత కాక మరెవ్వరును కనిపించెడివారు కారు.

'ఇట్లు పెంచిన సీతకు యుక్తవయస్సు రాగా మా తండ్రి యోగము భంగమైనది. జపమాగిపోయినది. సీతయే యోగము. సీతనామమే జపము. సీతకు దగిన వరునెక్కడి నుండి తేగలను? అతడెక్కడ నున్నాడు? అట్టివానిని దెచ్చుట నాచేనగునా? అని మా తండ్రి కంటనీరు పెట్టెడివాడు. సీత యద్భుత రూపము వర్ణించుటకు భాష చాలదు. ఆమె జ్ఞానము మానవులకు దుర్లభము. అట్టి సీతకు దగిన వరుడెవరు? అని మా తండ్రి తనలో దానే కృంగిపోసాగినాడు. ఇంతలో మహర్షి విశ్వామిత్రుడు వచ్చినాడు. కౌశికుని దృష్టి యతిలోకమైనది. అతడు సరియగు సమయమునకు సర్వసన్నద్ధముగ వచ్చినాడు.

'ఆ మహర్షి ఋణము దీర్చుట మీకుగాని మాకుగాని సాధ్యముకాదు. అతడు సంపాదించిన కీర్తి శాశ్వతమైనది. త్రిశంకుని రక్షించుటలో మీ కుల పురోహితుడు వశిష్ఠుని కన్న పదియాకులెక్కువ చదివిన వాడనిపించినాడు. నారబట్టల గట్టి గాలియే ఆహారముగా జడలుగట్టిన జుట్టుతో నాముని యెక్కడనో గుహలలో నివసించుచు తపస్సు చేసుకొనువాడు. వానికి సీత మిథిలలోను రాముడయోధ్యలోను నుండుట తెలిసినది. అంతే వాని తపోదీక్ష యాగిపోయినది. ధ్యానము భంగమైనది. అవి యన్నియు సీతారాములుగా పరిణమించినవి. అది యయోధ్యలో దశరథ మహారాజు తన కుమారులకు దగిన వధువుల కొరకు క్రిందుమీదులగుచున్న సమయము. తన యోగశక్తితో విశ్వామిత్రుడు వచ్చి వ్రాలినాడట. తన యాగ రక్షణకై శ్రీరాముని పది దినములు పంపుమని

కోరినాడట. మహారాజు మాత్రమంగీకరించక మడత పేచీ లెన్నో పెట్టి నాడట. దానితో ఋషి ఈ రాముని తానెరుగుదునని, కాదేని మీ ఋషివశిష్ఠ నడుగు మనియు ననెనట. తండ్రి తన తనయు నెరుగడట. కాని ఆతడెవరో ఇన్నినాళ్ల నుండి వారితోనే ఉన్న వశిష్ఠుడును, ఆగంతకుడుగా వచ్చిన విశ్వామిత్రుడును ఎరుగుదురట! ఇది యెట్టి సమత్వ మోకదా!

'ఇక నా విశ్వామిత్రుడు విశ్వమునకు మిత్రుడని పేరుపొందగలడు. ఈ సూత్రము లోకమును బాగుగా తెలిసిన వారిచ్చినది. ఈ సత్క్రియ వలన నా ఋషి శాశ్వతమగు కీర్తి పొందినాడు. మా తండ్రిగారి పురోహితుడు శతానందుడీ మహర్షి చరిత్ర యంతయు జెప్పగా విని, ఆహా! ఈ ఋషి చరిత్ర యెంత ఆశ్చర్యకరమైనదని అనుకొంటిమి. కౌశికుని చల్లని చూపుతో నంతవరకు మా తండ్రి పడుచుండిన మనోవేదన శాంతించినది. సంతోషము కలిగినది.

తన తల్లి శాపమును పరిహారము జేయించినాడన్న సంతోషముతో మా పురోహితుడు మునిశ్రేష్ఠుడగు విశ్వామిత్రుని గాథ నెంతో వినసొంపుగా జెప్పెను. రామభద్రుడు తన అస్త్ర గురువు యొక్క కథయని దాని నెంతో భక్తి శ్రద్ధలతో వినెను. ఆ గురుశిష్య సంబంధములాహా! అతి మానుషములు కదా! గురువు శిష్యుని వెంటబెట్టుకొని మిథిలా నగరమునకు వచ్చి, ప్రోత్సహించి మా యింటగల మహాభయంకరమగు విల్లు రామునిచే విరిపించెను. రాముడా వింటి త్రాటిని తెంపకయే విరచెను. ఆ త్రాడు విరిగిన వింటి రెండు ముక్కలను కలిపియుంచినది. ఇట్లు ఇరువైపుల వారిని ఉత్తమ నారియైన సీత కలిపి యుంచునని సంకేతము కనిపించుట లేదా? (వింటి త్రాటికిని నారి యని పేరు కలదు. నారి యనగా స్త్రీ).

'నా యింటనున్న సీతకెవడు స్వామియో? ఎంతటి వానికామె యిల్లాలు కాగలదో? వాడే ఈ వింటి నెత్తగలడని నీవు నిర్ణయించి యుండగా నేటికి మీ ముప్పురును ఓంకారము వలె చేరియున్నారని విశ్వామిత్ర ఋషి మాతండ్రితో

జెప్పెను. ఆహా! ఆ ఋషి యెంత ఆత్మవేదియో కదా! ఆతడు తత్వవేత్త యగుట చేతనే తాను సన్న్యాసియై యుండియును గృహస్థులకే శుభములు కలిగించినాడు. పాషాణము వలె దుమ్ములో పడియున్న అహల్య కాపురము నిలబెట్టినాడు. కన్యాదాతయు గ్రహీతయు, తానేయై వివాహ మంగళము నిర్వర్తించినాడు.

'పెండ్లి పెద్దగా తానే నిలచి నల్వురు వధువులను పిలిపించి నలుగురు వరులతో సలక్షణముగా పాణిగ్రహణములు చేయించినాడు. దానితో తన జన్మ తరించినదని యానందించినాడు. పరికించి చూడగా నతనిని మించిన మహర్షి వేరెవరుందురు? ఏది సత్కార్యమో ఆలోచించి సేవావ్రతిగా మారినప్పుడే ఆనందము కలుగును. అంతే కాని ఒంటరిగా నేమూలనో ముక్కు మూసుకొని కూర్చుండి, లభించిన కాయో పండో తినుచు నింద్రియముల నిగ్రహించుటకై ఎంత ప్రయత్నించినను నెవ్వడు లోకాతీతుడు కాలేడు.

'మాయక్క జీవితములో నొక మహాద్భుత సంకేత మున్నదట. ఈ మాటను కౌశికుడో, మాయింటికి వచ్చెడి యోగ దృష్టిగల ఋషులెవరైన జెప్పిరో కాని, అది నా చెవిలోబడినది. సీత పూర్వజన్మమున వేదవతి యను పేరు గల లక్ష్మీదేవియేనట. నారాయణునే భర్తగా వలచి తపోయోగములో నున్నదట. అప్పుడామె పై మోహపడిన రాక్షసు డెవ్వడో ఆమెను తాకెనట. దానితో నామె కోపించి మరుజన్మలో తానా రాక్షసుని జంపెదనని ప్రతిజ్ఞ పూని వెంటనే నిప్పులలో దూకినదట. మీరెప్పుడు వినలేదా?

'అసలామె యెక్కడ పుట్టినదో అక్కడి నుండి యెచటికి వెళ్లినదో ఏ విధముగా మిథిల జేరినదో తెలియదు. కాని యజ్ఞభూమిలో మాతండ్రికి కనిపించినది. ఆమె తల్లి గర్భమునుండి పుట్టినది కాదు. ఆది లక్ష్మీదేవియే సీతగా నవతారమెత్తి మావైపు వచ్చినది. ఈ మీ దాసి యదృష్టము ఇటువంటి యక్క దొరకినది. స్వామీ! ఇంతటి మహనీయురాలక్కగా దొరకినదని ప్రేమతో నామెను విడువక పుట్టినింటిలో హాయిగా గడపితిని. నేను కనిపించనిచో నామె నీరైన ముట్టెడిది

కాదు. నేను తోడుగా లేనిచో నామె నుయాల తొట్టెలో నిద్రబుచ్చుట సాగెడిది కాదట.

'ఆమె కంటె మాకు శాంతి సౌఖ్యములు ప్రసాదించిన వారెవ్వరును లేరు. ఆమె మా తండ్రికి ఆరవ ప్రాణము. ఆమెకై నీ యూర్మిళయు నెంత త్యాగమైన జేయగలదు. కనుక మీయన్నకై మీరును, మాయక్కకై నేనును సపర్యలు చేయుట, అందుకొరకు వనములకు వెళ్లుట ధర్మమగును. మాయక్కను చూడక నేనును క్షణమైన నిలువ లేను. మీవెంటనే నీడవలె నిలచియుండి ఆమె గుణదాసురాలనై శ్రద్ధాభక్తులతో సేవల జేసెదను. ఇన్నాళ్లకు నాకు సీతాదర్శనమను సంపద లభించును.

'నిజమునకు మేము కర్మయోగులము. యజ్ఞభూమిలో సాము చేయు క్షత్రియ జాతికి చెందినవారము. ఏ ఇంద్రియ వ్యాపారములును మమ్ము మా లక్ష్యము నుండి మరలించ జాలవు. ఇంద్రియముల పై జయము పొందుటయే ప్రేమకు మూలమని మా జనకుడుపదేశించినాడు. వానికి వయసు పై బడిన తరువాత భూపుత్రి సీత దొరకినది. ఆరోజు మొదలు మా మనసులు పాలు, శర్కర కలసిన ట్లైపోయినవి. ఐక్యమైపోయినవి. యోగ దృష్టిగల సిద్ధాంతులు కొందరు మాతండ్రికి అసలీ సీత యెవరను వైనము విశదముగా దెలిపిరి.

'ఈమె యెందుకు భూమిలో పుట్టినదో, ఈమె యెవరో మా తండ్రి యొకనాడు జెప్పియున్నాడు. ఆ విధముగనే సీతయు అద్భుత కార్యముల జేయసాగినది, పెద్ద వింటిని తన మెత్తని చేతులతో నెత్తుట వానిలో నొకటి. నిజమునకు దాని నెత్తుట కెందరో భటులు కావలసివచ్చెడి వారు. మురాంతకుడైన శ్రీమన్నారాయణుడు కోసల రాజ్యములో రఘురాముడై జన్మించగా నమస్కార మాత్రమునకే ప్రసన్నురాలగు లక్ష్మీదేవి సీతయై మా మిథిల జేరుకొనినది. మీరు స్వామికి దాసులు. నా స్వామి యైన మీకు నేను

దాసురాలను. మన యిద్దరము ప్రేమ ఫలించునట్లు, కోరికలు తీరునట్లు సీతారాముల సేవలు చేయుదము. అడవులకు వెళ్లుదము. బయలుదేరుడు.

'మీ యన్న రాముడు తన పేరుముందు మాయక్క పేరు చేర్చుకొని సీతారాముడైనాడు. దీని ద్వారా రాముడు చేయు ప్రతి పనికి మాయక్క యెంత ప్రోత్సాహమిచ్చుచున్నదో తెలిపియున్నారని మీరు గుర్తించినారా? ఈ మాట నేనుసుట శోభించక పోవచ్చును – కాని భర్త తన భార్యనెంత గౌరవించునో, అదియే వాని కంతటి యదృష్టము కలిగించును. త్రిమూర్తులు కంతటి భోగము వారి భార్యల ద్వారా వచ్చినదే కదా! రాముడు రాజవంశమున కాభరణము వంటివాడు. అట్టి రాముడు అయోనిజయైన సీత వెనుకనే ఆమె భుజముపై చేయిమోపి తనకామె యాధారమన్నట్లు నిలిచినచో వారి తేజస్సు దేవతలైనను తేరి చూడరానంత తీక్షణమై యుండగలదు. కనుక మీముందు నేనును వచ్చెదను, బయలుదేరుడు.

'స్వామీ! విజ్ఞులైనవారు మాతండ్రి వద్ద చేయు చర్చలలోనే వినిన సూచనలు వినుడు. జానకి తనవద్ద నుండగా రామచంద్రుడు తనకెంత అపకారము చేసిన వానినైనను వధించడట. అంతేకాదు. కాకులు గ్రద్దలు కోతులు కూడ వనవాస యాత్రలో తమ చేతనైన సాయము జేసి తరించునట. అట్టి మా సీత పాదముల వద్ద రాత్రింబవళ్లు దాస్యము చేసి నా జన్మను అర్థవంతము జేయదలచియుంటిని. కాని అందుకు మీ యొప్పుదల లేదు. నా యభిలాష యేదైనను మీకొరకై దానిని వదలుకొనుచున్నాను. భర్త సంతోషించుటకు మించి భార్యకేమి కావలెను?

మా తండ్రి కూడ ఒకమారు 'ఊర్మిళా! ఎపుడైన శ్రీరాముడు భార్యతో గలసి యడవులకు వెళ్లనేని, నీ భర్తను ప్రోత్సహించి సీత సేవ జేయుటకు పంపుము... కాని' అని దానిని పూర్తిగా చెప్పకుండా వదలినాడు. అంతతో వదులక ఆ మరునాడు నేను మా తండ్రి నడిగితిని. అపుడాయన మనసు విప్పి మాట్లాడెను. ప్రేమతో సర్వమును వివరించెను. నాకు తృప్తి కలిగినది.

మీరెప్పుడును నడవిలో జానకి నొంటిగా విడచి వెళ్లకుడు. ఆమె మిమ్ములను పొమ్మనినచో అందేదో రహస్య మున్నదని భావించి వెళుడు. మాయక్క మనసొక మహాకావ్యము వంటిది.

'స్వామీ! మీరెవరినైనను హాస్యమాడకుడు, ఎవరిపై నైనను చేయి చేసుకొనకుడు. దాని వలన వారికి దుఃఖము కలుగును. అందుచే వచ్చునపవాదు భరింపజాలము. నా మాటలు మీ చెవికి జేరిన యెడల వీనిని మరచిపోకుడు. ఏ స్త్రీలపైకిగాని జంటలపైకిగాని బుసగొట్టి దుముక బోకుడు. శేషత మీ స్వభావమే కావచ్చును. కాని చీటికి మాటికి ప్రతివారిపై దోషారోపణ జేసి రోసము జూపిన మీయన్న సహింపడు. ప్రభువువద్ద స్వాతంత్ర్యత కూడదు. పారతంత్ర్యమే రూపుదాల్చినట్లు వర్తింపుడు. నా వంతు సేవ కూడ నిండు మనసుతో మీరే చేసి నన్నును తరింపజేయుడు.

'మాయక్క మనసు విరజాజి పూవు వంటిది, చాల సున్నితమైనది. ఏ జీవికిని కోరి బాధ కలిగించనిది. ఇతరులు కలిగించిన యెడల చూచి సహించలేని దయాహృదయ మామెది. మీ యీ అరణ్యయాత్ర వలన నామె చరిత్ర మొక మహాకావ్యము కాగలదు. అడవిలో మీవలె నేనును ఇచట ఇంటినే అడవిగా భావించి యీ పదునాలుగేండ్లను ఏకభుక్తముగా గాలినే దినుచుం దును. రామచంద్రునికి సీతకు భావనారూపముల నిచ్చి నా హృదయపీఠముపై నిలిపి పూజించుచుందును.

'మీరో అడవినే అయోధ్యగా భావించుకొను ఉదార హృదయులు. నేనో అయోధ్యనే అడవిగా దలచు అల్ప మనస్సు కలదానను. బ్రహ్మదేవునికి వార్ధక్యము వలన బుద్ధి జడమై యుండవచ్చును. కనుకనే నాకీ జన్మ నిచ్చెను. ఒక మారైన భర్త పాదములు కడిగి యర్చించు నదృష్టము పొందజాలనిదానను. శారీరక సంబంధములేని వలపు కలకాలము నిలచి యుండగలదు. మన మధ్య నాత్మీయత యున్నచో నెంత దూరమునందున్నను మనోనేత్రములతో చూచుకొను

చుండ గలము. మీరు చేసిన ఏ పుణ్యమో స్వామి సేవ జేయునవకాశము పొందినారు. మా యక్కయు మిమ్ములను వెంట వచ్చుట కనుమతించినది. దేవర క్షేమముగా తిరిగిరండి.

'ఈ విధముగా మీరు వచ్చువరకు మీరు క్షేమముగా తిరిగివచ్చెదరను నాశతో ఒంటరినై ఈ పదునాలుగేండ్లను ప్రవాసము చేయుచుందును. బయలు దేరుడు. మీ యిల్లాలిచట పడియుండునని జ్ఞాపకముంచుకొనుడు. మీతో కొన్ని విషయములు ముచ్చటించు స్వతంత్రత జూపితిని మన్నింపుడు. అవి నా మనస్సాక్షి పలికించిన మాటలు సుమా!"

ఉర్మిళ తన చివరి మాటలను భర్త పాదముల పై ఒట్టు పెట్టినట్లుగా పలికి వాని పాదము లంటగా, లక్ష్మణుడు ఊర్మిళా! లెస్సగా పలికితివిలెమ్మని ఊర్మిళను కౌగలించుకొనెను. తన వనవాస యాత్ర నిశ్చయమైనదని మనసులో సంతోషపడెను.

మేలిమి బంగారము నపహాస్యము చేయు శరీర కాంతితోను, చంద్రుని ధిక్కరించు గుండ్రని ముఖ సంపదతోను, విశ్వమంతటి విశాల నేత్రములతోను, శ్రీరామసేవ ఫలకాంక్షతోను, సంతృప్త హృదయముతోను, చెంగులు జార్చిన పట్టుబట్టలు ధరించి అడుగో! లక్ష్మణుడిటే వచ్చుచున్నాడు.



# శ్రుతకీర్తి

## (శత్రుఘ్నుని భార్య)

పవిత్ర సరయూనది కెరటముల పైనుండి మెల్లని పిల్లగాలులు వచ్చి తాకుచున్నవి. వాని తాకిడికి ఆమె ముంగురులు ముఖము పైనను, మేలి ముసుగుగా నున్న సరిగంచు పైట హృదయము పైనను నర్తించు చున్నవి. ఆమె అయోధ్య నగరమున నెత్తైన రాజ భవనపు పైమిద్దె పై నిలచియున్నది. చూచితిరా? కీర్తి, శత్రుఘ్నుని భార్య, భరతుని వాని మేన మామ పిలువగా ప్రయాణమై వెళ్లుచు, తన సవతితల్లి యైన సుమిత్ర చిన్న కొడుకు శత్రుఘ్నుని తన వెంట రమ్మనెను. భరతుని కాతడు ప్రేమపాత్రుడు. శత్రుఘ్నునితో నాతని భార్య శ్రుతకీర్తియు సూర్యునితో అనుసరించి వెళ్లు ఛాయవలె వెళ్లెను. భరతుని భార్య మాండవియు శ్రుతకీర్తియు నేకోదరులైన అక్కచెల్లండ్రే. ఇది జరిగి పండ్రెండు ఏండ్లయిపోయినది కదా!

మేనమామల ఇంట నున్న భరతుడు తన తల్లిని తండ్రిని మరచిపోయినాడు. శత్రుఘ్నుడు తనకు తోడుగా నుండుటతో అన్న రామచంద్రుని, సోదరుడు లక్ష్మణుని కూడ మరచెను. దీనికి తనతోనున్న శత్రుఘ్నుని పరమ విలక్షణమైన సద్గుణములు కారణము కావచ్చును. శత్రుఘ్నుడును కైకేయీ పుత్రుడైన భరతుని స్నేహమును తన జీవితమున లభించిన అదృష్టముగా భావించుచుండును. మరి కైకయో? కౌసల్యా తనయుడైన శ్రీరామచంద్రుని సద్గుణములచే నాతనినే

తనయునిగా నాదరించు చుండును. ఈ కారణముల చేతనే భరత శత్రుఘ్నులు అయోధ్యలోని తమ యాత్మీయులను వదలి, వారికి దూరముగా నుండుటచే గలుగు దుఃఖమునేమాత్రమును పొందక యుండగలిగిరి. వారివి హృదయమును స్పర్శించు బాంధవ్యములు.

భరతుడున్న చోటనే శత్రుఘ్నుడు దివ్యదేశముగా భావించును. భరతునే తన యాత్మ పోషకునిగా నెంచును. భరతుని పాదార్చనయే తనను ఉద్ధరించునని నమ్మును. భరతుని వద్ద పారతంత్ర్యము వహించియుండుటయే తాను పొందదగిన ఫలమని విశ్వసించును. శ్రీరాముడతని పెద్దన్నయే, కాని వానిపై శేషత్వమే మాత్రము చూపడు, పారతంత్ర్యము లేనేలేదు. భరతుడు రామచంద్రునే అనుక్షణము నారాధించుచు నున్నందున, భరతుని సంతుష్టికై వానితో గలసి శ్రీరాముని సేవించుచుండును.

'ఎవనికి గాని రామభక్తియను విషయ మెప్పుడును రాకూడదు. అది స్వాధికారమును దూరము చేయును. భరతుడో? భాగవత శ్రేష్ఠుడు. అతని యందు భక్తి కలిగియుండిన చాలును. రాముని ఇతరులతో పోల్చి చూచుటకు వీలుకాదు. రాముని జూచినవాడెవడైనను వానికి మోహము కలిగి తీరును. దానివలన నింద్రియములు వశము తప్పును. అట్టివాడు ఎట్లు సేవ జేయగలుగునని శత్రుఘ్నుడు చెప్పుచుండును.

ఇక భరతుడో? తన మేనమామల యింటికి వెళ్లుచు – పాదుకలను ధరించి వెళ్లునట్లుగా – శత్రుఘ్నుని తీసుకొని వెళ్లెను. అపుడు శత్రుఘ్నుడు తన భవిత యెట్లుండునని యోచించలేదు. తన యభిరుచులకా నగరము సరిపడి యుండునా అని సందేహించ లేదు. ఇట్లు అకారణముగా, తలవని తలపుగా వానికి భగవద్భక్తుడగు భరతుని సేవ ప్రాప్తించినది, అభిమానము సిద్ధించినది. భరతుడు పరమ పవిత్ర రామ పాద పద్మముల పై భక్తిభావము కలవాడు. ఆ భాగ్యశాలియందు భక్తియే శత్రుఘ్నునికి లభించినది. ఇట్లే

అన్నదమ్ముల పొత్తు పెరిగినది. వీరిద్దరు రామలక్ష్మణులవలె వీడని జతగా కూడియుండిరి.

ఈ విధమగు ఆత్మబంధముతో భరత శత్రుఘ్నులు కలసియుండగా కాల ప్రవాహము పొంగిపొర్లుచు పన్నెండు ఏండ్లు గడచిపోయినవి. ఒకనాటి తెలవారు జామున మాండవీ పతి భరతుడొక దారుణమైన కలగనెను. ఆ సమయమున వచ్చిన కలలోని విషయములు జరిగి తీరుననియు, అవి వృధా కావనియు కలతపడి భరతుడు ఏదియో చెడుగు తండ్రి దశరథునికో, అన్న రామునకో, తనకో మరి యింకెవరికో కలిగి తీరునని విచారమున మునిగెను. చుట్టును చేరిన మిత్రులు చేయు హాస్య ప్రసంగములు కూడ వానికి ఊరట కలిగించ వయ్యెను. ఇంతలోనే వెంటనే అయోధ్యకు రావలసినదిగా వార్తయు వచ్చెను. భరత శత్రఘ్నులు తమ భార్యలతో నయోధ్యకు బయలుదేరి రాత్రింబవళ్లేడు రోజుల ప్రయాణము తరువాత అయోధ్య చేరిరి. అచట రాజు దశరథుని మరణవార్తయు, వాని యంత్యకర్మలకై పిలిపించినట్లును తెలిసిపోయినది.

ఈ వరుస సంఘటనలతో శ్రుతకీర్తికి చెప్పరాని మనోవ్యధ కలిగి దానిని చల్లబరచుకొనుటకు మనోహరమగు భవనము పై కెక్కి పట్టణము నలువైపుల జూడ సాగినది. వీధులలో ప్రజలు నిట్టూర్పులు విడచుచు బరువెక్కిన హృదయములతో మెల్లగా కైక భవనము వైపు వెళ్లి యచట గుంపులు గుంపులుగా కూడు చుండిరి. అచట వారేమి చూచిరి? భరతుడు తన తల్లితో జగడమాడుట యని వేరుగా జెప్పన క్కర లేదుకదా!

ప్రయాణ శ్రమతో శ్రుతకీర్తి శరీరము మల్లెపూవువలె వాడిపోయినది. దశరథుడు మృతుడయ్యెను. అక్క సీతతో రాముడడవికి వెళ్లెను. రాజ మందిరము లోని సంగతులన్నియు రహస్యములుగా నున్నవి. ఆమె తండ్రి కుశధ్వజుడు యోగ దృష్టి గలవాడు. అతడు తన పుత్రికలు మాండవీ శ్రుతకీర్తులకు తత్త్వబోధ జేసి యున్నందున గృహచ్ఛిద్రముల వంటి సమస్యలు కలిగిన సమయమున నాయిద్దరును న్యాయమునే చెప్పగల మనోనిబ్బరము జూపుచుందురు.

'ఆమె మనసులో నయోధ్యలోని సంఘటనలన్నియు నొక్కొక్కటియే కనిపించుచున్నవి. కైకమ్మ మొండి పట్టుదల, రాముని అరణ్యయాత్ర, సీతయు లక్ష్మణుడును వాని ననుసరించి పోవుట, దగ్గర కుమారులు లేక దుఃఖముతో దశరథుని నిర్యాణమునను దృశ్యములన్నియు నామె మనోనేత్రము ముందు తాండవించి కనుమగుగైనవి. వాని వెంట భరతుని దుఃఖము, కైకను దుర్భాష లాడుట, కౌసల్య వద్దకు వెళ్లి రామునడవులకు పంపుటలో దన పాత్ర యెంత మాత్రము లేదని చేతులు జోడించి చెప్పుట, మంత్రి పురోహితుల యను మతితో నూనె తొట్టెలో నున్న తండ్రి శరీరమును కన్నీరు మున్నీరై పారుచుండగా బయటకు దీయుట, తండ్రి పేరుపై బ్రాహ్మణులకెన్నియో దానములిచ్చుట, ప్రేతకర్మలు జరుపుట, గృహదైవమగు రంగనాథుని సన్నిధియందు పరమపదోత్స వము నిర్వర్తించుటయు నామె మనసులో మెదలినవి. ఇంకనేమేమి జరుగునో యను వ్యధతో నామె సౌధము పై నిలచియున్నది.

'పరుగెత్తుకొని వచ్చుటచే నైయుండును – ఒక పరిచారిక రోజుచు చరచర వచ్చినది. వచ్చి శ్రుతకీర్తికి నమస్కరించినది. నమస్కరించి 'దేవీ! మన చిన్న ప్రభువులవారు మంథరను సిగబట్టుకొని బరబర యీడ్చినారు. ఆమె పై నెంతయో కోపముతోనున్నారు. వారిచేత కత్తియున్నది. ఆమె తల నరకెదరేమో?' అనినది. శ్రుతకీర్తి యీవార్తవిని మనోవ్యధజెంది, అట్లే నివ్వెరపడి చూచుచుండగా మరియొక దాసి పరుగున వచ్చి 'చిన్నరాణీ! శత్రుఘ్నులవారు తమయన్న భరత ప్రభువు మాటపై మంథరపై దయజూపి విడిచి పెట్టిరి. ఇక కంగారుపడనక్కర లేదు. ఈ మొత్తము సంఘటన నగరమున నొక పెద్ద వింతయైపోయినది' అని ధైర్యము చెప్పినది.

ముదుసలి మంథర సిగ బట్టి తన భర్త యీడ్చెను. ఇది యెంతటి దుష్కార్యము! అయ్యో! దీనిని భరించుటెట్లని శ్రుతకీర్తి హృదయ తాపము నందెను. తలవాల్చి అసహనముతో మేడపై నటునిటు పరిచారము చేయుచు

'అయ్యో! ఇది యెంతటి అపవాదు!' అని చింతించు చుండెను. ఇంతలో దాసియొకతె గునగున వచ్చి 'మన చిన్న ప్రభువులవారు వచ్చుచున్నా' రను వార్త చెప్పినది. శ్రుతకీర్తి తన కటి భారముచే నడుము వణకుచుండగా చరచర మెట్లు దిగి పద్మ వర్ణమున నొప్పు తన పాదములకు ధరించిన పాదాభరణముల మువ్వలధ్వని హంసల కంఠరవమును మురిపించు చుండగా వచ్చినది.

కదలుచున్న కల్పలత వలెను, మెరయుచున్న బంగారురేఖవలెను, ముఖమున ముంగురులు కదలుచుండగా, వెనుక భాగమున జీరాడు జుట్టు చీకటి వలె వ్యాపించి యుండగా సంతోషమో విచారమో చెప్ప సాధ్యముకాని స్వరముతో భర్తతో ననినది "శత్రుఘ్న స్వామీ! స్వాగతము రండి రండి, సుస్వాగతము. మీ పేరును సార్థకము చేసుకొని ఇచటికి విజయము చేసినారు. ఈ దాసురాలికి చాల సంతోషమైనది. శత్రువుల దపింప జేయువాడను పేరు ధరించియున్న స్వామీ! జయము. నిత్యమును శత్రువులను మర్దించుదురన్న ప్రతిష్ఠకల స్వామీ! జయము పరులెవ్వరికిని లేని మంథరతో యుద్ధము చేసితిరన్న కీర్తివంతుడా! స్వాగతము!

'ఒక గూనిది చేసిన పనికై కోపము కలిగి, దానిని ఆపుకొనలేక, దాసి సిగబట్టి నేలపై యీడ్చి, అన్న యాజ్ఞపై నామెను వదలిపెట్టినారట కదా! ఏది యేమైనను మీ పేరు సార్థకము జేసుకొన్నారు. ఇప్పటికీ కథ ముగిసినది.

'తన బిడ్డలు వృద్ధిలోనికి రావలెనను కోరికతో కని పెంచిన తండ్రి మాట మీరునంత వృద్ధికి మీరును భరతులవారును వచ్చినారు. రఘువంశమను కల్పలతకీ పరిమళము చాలును. పారతంత్ర్యమనునది మీ బహిర్గుణము. లోగుణము మాత్రము శూరత్వమే. కాగా భరతుల వారికి ఆకారము శేషతా గుణము. అందుచే శేషత్వము, లోగుణము పారతంత్ర్యమును, ఇట్లు మీ యిద్దరకు సిద్ధించినవి. మీయన్న భరతుని శేషత అందరకు తెలిసినదే. వారి జీవితమునకది యాభరణము అది వారికి పుట్టుకతోనే వచ్చినది. ఆ కారణము చేతనే

తలిదండ్రుల తోడి బాంధవ్యమును ప్రాకృతమైన దానినిగా దలచి రోషము వహించినారు.

'మీరు వారికి సోదరులు. ఆ సోదరుని మాట మీర లేక మంధరను చంపుట మానినారా? లేక యా మంధర పక్షమున మీ పెద్దయన్న రామచంద్రుడు న్నాడను భయము చేత విరమించినారా? మీ బాహువులయందు శౌర్యలక్ష్మి దండిగా నున్నది. కనుక మీకీ భూమండలమంతయు సమర్పించినచో కోపము తీరిపోవునా? శాంతము కలుగునా?

'ఇంతవరకు మీకు పెట్టిన శత్రుఘ్న నామము సార్థకముగా నున్నదని అనిపించినారు. ఆడుదానిని కొట్టుట అనునది మీ కుటుంబములోని యాచారమే కదా! పెద్దయన్న తాటకను గొట్టగా, ఈ కనిష్ఠ సోదరులు గూని దానిని గొట్టినారు. సరే! రండు భవనము పైకి వెళ్లుదము. మన సంభాషణ ప్రజలెవరైన విని చిలవలు పలువలు పెట్టి కథలు కల్పించ గలరు. ఏమైనను నన్ను మీరు వీరపత్నిగా జేసినారు. ఇందు కేదైన బహుమతి సమర్పించ వలెను కదా! మీ కోరికయేమి?"

శత్రుఘ్నుడు తన ముఖము పైకి వచ్చు చిరునవ్వును లోననే అణచి పెట్టి, "దేవీ! శ్రుతకీర్తీ! సత్యమైన మాట జెప్పెదను. ఓరిమితో వినెదవా? నీ మాటలు ధ్వని ప్రధానమగు మంచి ప్రబంధము వలెనున్నవి. నేను కైక దాసిపై చేయిచేసుకొన్నందు కాగ్రహించితివా? నాకేది కావలసినను దానమిచ్చెదనంటివి. దానితో త్యాగమూర్తివై నిలచితివి. నావంటి వాని కిచ్చెదవన్నను స్వీకరింప గోరడు – దాన ప్రతి గ్రహములనువానికి, దానము చేయకూడదు, దానము తీసుకొనకూడదు అనునవి దండనలు, ఇదే వీని తత్త్వము, ఇక చాలును, మనసు మళ్లినది. ఈ లోకపు టార్తిని గమనించి యీ చిన్న రాణి తన వరదానపు కోర్కె మానుకొనుట మంచిది.

'ఈ దానమను పనిని మా తండ్రి మా పినతల్లి కైకమ్మకు జేసెను. దానితో

రాముడు కట్టుబట్టలతో నడవికి వెళ్లినాడు. అసలు కారణము వినిపించెదను. భర్త భార్యకెప్పుడో వరదాన మిచ్చెను. అది యెంతో చెడు వార్తగా నేడు ప్రచారమగుచున్నది. కాదు – అప్పుడే ప్రాకిపోయిన దనుటయే సమంజసము. ఈ దానమునకు గుర్తుగా నేడీ యయోధ్యలో గూని మంథర మిగిలియున్నది. దాని కులమేమో తెలియదు. జాతినెరుగము. ఎచట నుండి వచ్చినదో ఆ జాడయు తెలియదు. ఆమె పుట్టుకయే తెలియదు. ఎక్కడనైన జన్మించనీ. అందగత్తెయా? కానే కాదు. నుదుటి వ్రాత ప్రకారమామె కైకమ్మకు దాసిగా లభించినది. ఏ పుణ్యమో కోతికి రాజభోగము కలిగినది. దానిదే అదృష్టము. మా పినతల్లి దాని గుప్పెటలో బడినది. అనేక సంపదలు పొందుచు కన్ను మిన్ను కానకపోయినది. ఇక కైకమ్మయో? పేరుకు మాత్రమే యజమానురాలు. కాని దివాణములో నే పనికైన నీ కుబ్జయే దర్శన మిచ్చును, ఆమెదే అధికారము.

పాపము, దశరథ మహారాజులవారి కివి యేవియు బట్టవు. కైకమ్మ కెక్కడ ఆగ్రహము కలుగునోయని గూని మంథర యెంతలేసి పనులు చేయుచుండినను, వానిని గుర్తించిన వారు ఫిర్యాదులు చేసినను ఏ మాత్రము పట్టించుకొనరు. వారికి భార్యపై గల తీపియే నేటి స్థితికి కారణము ఈ దేవిగారి కేమని మనవి జేయగలను? దాసిని మంచి చేసుకొని దానిని ప్రోత్సహించి దానికి కోపము కలిగినపుడు తానే తగ్గుచు, దానికి సంతోషము కలిగిన తానుపొంగిపోవుచు – మహారాజుల వారిట్లు దాసికి లొంగిపోయినారు. ఇక కైకమ్మయో? దాసి మాట యామెకు ద్రాక్షారసము. ఇక యీ చిన్నరాణి వారికేమి విన్నవించగలను?

'ఆ పొట్టిదాని గూనిలో నెన్నో బూటకపు గచ్చపొదలున్నవి. అది కోటిని మించిన మాయల నిలయము. అవియన్నియు పూచి, కాసినవి. వానిని నేను వ్రేళ్లతో ఏక నాశనము చేయవలయును. దాసిగా వచ్చి యెంత చేటు చేసినదో తెలిసినదా? దాని ఓర్వలేనితనము వలననే రామపటాభిషేక మాగిపోయినది. ఇది భరతుని కంగీకార మగునా? కాదా? విచారణ కాని భయముకాని లేక

భరతునయోధ్యా పతిగా జేయుమను విషమామె యే కైక నాలుకకు పూసినది.

కైక మనసుమారి మంథర పట్టు బిగిసినది. కైకమ్మ కోప గృహము చేరినది. కుబ్జ సలహాలను తన మాటలుగా రాజునకు జెప్పుటకు ముందు కన్నీరు పెట్టుచు లేని దుఃఖము నభినయించినది. ఆడువారు కోరు కోరికలను వేగమే సాధించి పెట్టు సాధనము కన్నీరే కదా! సులభముగా తెచ్చుకో గలిగినది. తిరుగులేనిది. రాజామె కన్నీరు తుడుచుచు రామచంద్రునిపై యొట్టు పెట్టి ఆమె కోరిక దీర్తునని మాట యిచ్చినాడు.

'వరముల ప్రస్తావనతో రాజును ముందుగా కట్టివేసి, మంథర తన కుపదేశించిన దంతయు తెగువతో వెల్లడి చేసినది. భరతుని రాజుగా జేసి రామునడవులకు బంపవలెనన్నది. తన కోరికలు తిరుగు లేనివనినది. రాజు వానిని నెరవేర్చి తీరవలసినదే అని పటుబట్టినది. నేనింతటి కఠోర వాక్యముల జెప్పుచున్నను శ్రుతకీర్తీ ! నీలో నే చలనమును లేదు. తత్తరపాటు లేదు. కంట నొక చుక్క నీరైనను రాదు. ఈ చిన్నరాణి వారి హృదయము నా బ్రహ్మదేవుడు రాతితో చేసి యుండ లేదుకదా? అట్లు లోకము భావించినను వింతపడదగినది లేదు. ఎందులకనగా సకల లోకమును తపింప జేసిన ఈ సమాచారము నారి నేత్రమును చలింపజేయ లేకపోయినది.

'తండ్రి యాజ్ఞ పాటించు నీతి ననుసరించి రాముదరణ్యములకు వెళ్లినాడు. తన స్వామిని సీత యనుసరించినది. రాముని ప్రేమ గుణమునకు దాసుడై మాయన్న లక్ష్మణుడు వారి వెంట వెళ్లినాడు. రాజు దుఃఖముతో ఆర్తినొంది చచ్చి నూనె తొట్టిలో పాచి శవమై పడియున్నాడు, చచ్చిన రాజుకు తలకొరివి పెట్టుట కొక్క కొడుకైనను దగ్గర లేడు. ఈ దుస్థితి కలుగుటకు కారణమెవరు? ఆ దాసి యే కదా! రాముడడవికి వెళ్లుటకు కారణ మామెయే కదా! రాజు చావుకు కారణమామె కదా? ఇవి యన్నియు సహించదగిన దోషములేనా?

'మా తండ్రి దశరథ మహారాజు మమ్ము పండ్రెండేండ్లు పిలిపించక

దూరముగా నుంచినాడని దాసిది కైక చెవిలో నూదగా – ఆమె యెదుటనున్న కుమారుడు రాముని విధముగా దూరముగా బంపినదనుటలో ననుమానము లేదు. ఇది పెద్ద కుట్రలో నొక భాగము. చెప్పుడు మాట లెంత పని జేయునో చూడుము. రాజు అర్థరాత్రమున మంచముపై నుండియే మరణించెను. ఆ సమయమున రాజును మంచము పైనుండి క్రిందికి దింపువారు కరవైనారు. ఆహా! రాజైనను మాతండ్రి కీదుర్గతి తప్పలేదు. ఇందుకు ఆ కైక దాసిని సిగ బట్టి యీడ్చుటేకాదు, గొంతు కోయుటయు దోషము కాదు. నీవు దోషమని భావించుచున్నావా?

అయోధ్య పాడువడినది. పౌరులన్నపానములు వదలి రాముని కొరకు భోరుమను చున్నారు. ఒక తల్లి అప్పుడే పుట్టిన బిడ్డనెత్తుకొన బోయి మనసులో రామచంద్రుడు గుర్తుకు రాగా, తన బిడ్డ నెత్తుకొనుట మానివేసినదట. దేవాలయములలో దీపారాధనలు లేవు. కాలము కలిసివచ్చి చేతికి నిధి దొరకినను ఛీ! యనువారే కాని సంతోషించువారు లేరు. రామునివెంట వెళ్లుటకు శ్రోత్రియ బ్రాహ్మణులు దుఃఖముతో తమ అగ్నిహోత్రములను భుజములకెత్తినారు.

సర్వసంపదలతో తులతూగు మా రాముడు సీతతోను, లక్ష్మణుని తోను నేడడవికి చేరినాడు. మిగిలిన పుత్రులలో నెవరును ఊరిలో లేరు, రాజా? స్వర్గమున కేగినాడు. నగరమిట్లు అయిపోయెను కదా! అని నగరదేవత పడుచున్న తాపము జెప్పశక్యము కాదు. ఏమి యిల్లు? ఏమి పుత్రులు? ఎక్కడి సంపదలు? ఏమి బంధువులు భూముల పుట్రల ప్రయోజనమేమి? మాకు సుఖములు కలిగించు రాముడు మా ప్రభువు. అతడే అరణ్యముల కేగగా మాకేమియు నక్కరలేదు! అని నగర స్త్రీలందరు విరక్తితో గృహధర్మముల విడచి వేసినారట, నీవు విన లేదా?

మా పెద్దన్న రాముడు నగరములోని ప్రతి యింటికి వెళ్లి వారి మంచి

చెడులు తెలుసుకొనెడి వాడట. ఏ యింట నే శుభము జరిగినను నా యింటి వారికి సహాయకుడుగా నుండెడివాడట. శుభాశుభములలో నగర ప్రజలకు దగ్గర చుట్టముగా మసలుకొనువాడట. నీవు విన్నావా? రాముడు మమ్మన్ని విధముల రక్షించెడువాడు. మా యిండ్లలోని సమస్యల నన్నిటిని తీర్చువాడు. వాటిని మేము రామునితోనే చెప్పుకొనువారము. రాముడే మా సమస్యల పరిష్కర్త. అట్టి రాముడిక మాకు కనిపించడు కదా!' అని వాపోవు గృహిణుల కంఠధ్వనులు నీకు వినబడుట లేదా?

నగర శ్రోత్రియులు యజ్ఞ యాగములు జేయు సమయమున మాయన్న వారితో నుండెడి వాడట. దానధర్మముల జేయువారికి సాయపడుచుండెనట. అయోధ్యలో వీధి వీధికి, నింటింటికి వెళ్లి పరిశీలించెడి వాడట. పౌరులు దుఃఖములు పొందగా, తానే వారి కష్టములకు వారికంటె నెక్కువ వ్యసనము పొందుటచే పౌరులే రామునోదార్ప వలసి వచ్చెడిదట. ఇంతటి ప్రభువున కరణ్యవాసమా? ఈ యనర్థ మంతయు నా గూనిదాని మూలముననే కదా! మా రఘువంశ గౌరవమెమై పోయినదో కదా! రామ ప్రభువు వంటి వాడును పలుచని దివ్య వస్త్రములు వదలి నార చీరెలు కట్టి అడవుల బట్టి పోవలసివచ్చెనని విన్నావా? ఇది దుఃఖ కారణము కాదా?

చెవుల వరకు వ్యాపించిన నీ పెద్ద కండ్లలో నీటిబొట్టైన కనిపించదు. ముఖమున బాధలేదు. సరే ఈ విషయమైనను విన్నావా. అడవికి పోవు మీయక్క సితమ్మకు కైకయిచ్చిన నారచీరెను – అంత వరకామె ధరించియున్న చక్కని వస్త్రముపై – రఘురాముడే ధరింప జేసెనట. ఇది దుఃఖింప దగిన కారణము కాదా? అయోధ్య దుఃఖమును, శ్రుతకీర్తీ, రా! మనము మేడ పైకి వెళ్లి బాగుగా చూడగలము' అని శత్రుఘ్నుడు సుకుమారమై వెచ్చనై యున్న భార్యచేతిని పట్టుకొని తీసుకొని వెళ్లెను. రేగుచున్న ఆమె ముంగురులను తొలగ ద్రోసి యిట్లనెను.

'చూడుము, అయోధ్యా నగర దీనస్థితిని పరికింపుము. రామస్వామి పట్టాభిషేక శుభమునకై వాకిళ్లలో బెట్టిన పూర్ణకుంభములు, కట్టిన మామిడి యాకుల తోరణములు ఉంచిన మంగళ దీపములు, వేసిన కొబ్బరి యాకుల చలువ పందిళ్ళు వాని గుంజలకు గట్టిన అరటిచెట్లు రామవియోగమునకు ముఖములు వాల్చి వెలవెల బోవుచున్నట్లేయున్నవి. చూచితివా? తెలవారినంతనే రఘువీరుడైన రాముడు గద్దెయెక్కి యాపిమ్మట ఏనుగునెక్కి లోకములను మోహ పెట్టు సుందర రూపముతో మా వాకిళ్లగుండా వెళ్లును, అప్పటి కివి సుందరముగా నుండవలెనని ముచ్చట పడి మానగర పుణ్య స్త్రీలు వీధులలో పెట్టిన ముగ్గులింకను నట్లే యున్నవి. చూచినావా?

'దూరదేశాలకు జెందిన బంధువులందరు సింహాసన మెక్కిన రాముని సేవించుకొనుటకు వచ్చినారు. వారందరు నీ నగరమున తమ బంధువుల ఇండ్లలో విడిది జేసినారు. ఈ పచ్చ తోరణములు కుబ్జ మూలమున వ్యర్థమై పోయినవి. ఈ కార్యమున కామెను తెగనరకినను, శ్రుతకీర్తి! అదెట్లు దోష మగును? రాముడెక్కి వెళ్లిన రథము వెనుకనే పరుగు బెట్టుచు దశరథుడు, 'హా! రామాయని ఏడ్చెనట. రాణి కౌసల్యయును 'పుత్రా! రామచంద్రా! మావైపు చూడవా?' అని రాళ్లు కరగునట్లు ఏడ్చెనట. నాగరకులందరు దుఃఖముతో రాముని వెంబడించి వెళ్లినారట.

ఆ సమయమున ప్రజల యార్తనాదములు, శోకములతో, చెరువులు, కొలనులలోని నీరంతయు వేడెక్కి సలసల మరిగిపోయెనట. పక్షులు విలవల లాడిపోయెనట, చెట్లు మలమల మాడిపోయినవట. తీగలకు క్రొత్తగా పూచిన పూవులు మొగ్గలు జలజల రాలిపోయినవట. ఇట్లేందుకు జరిగెను? అడవికి వెళ్లు శ్రీ రామచంద్రుని ఎడబాటు అను తాపము వలననే. ఈ పరిణామములకు కారణ భూతురాలా కుబ్జయే. కౌసల్యాదేవి సూటిపోటిగా కోపముతో నేమో మాటలనగా మాయన్న భరతుడామె నోదార్చుట కెన్నియో ఒట్లు సత్యములు

పెట్టుకొనవలసినవచ్చినది. ఇపుడతనిని గౌరవించు నయోధ్యా పౌరుడొక్కడును లేడు. ఎంతటి చెడు కొలము వచ్చినది. దీనికేమందువు?

భరతునికి రాజ్యముపై నెంతో తీపియని పామర జనులందరును అపవాదు వేయక ఊరకొందురా? అతడు భగవద్భక్తుడు. అట్టి భాగవతునికి రాజ్య కాంక్షయా? ఛీ! ఒక పరిచారికా రూపములో నొక మహాసర్పము క్రక్కిన విషమిది. ఇంకను శ్రుతకీర్తి! దాని పై దయజూపుమందువా? ఈ పరాభవమునకు కారణమెవరు? పాదముల వద్ద పడియుండి చాకిరి చేయవలసి యున్న దాసి. దీనిని సహించరాదు. వెంటనే వెళ్ళి, గూనిదాని తలను నా కత్తితో నరకి వేసెదను".

వీరావేశముతో ముందుకు దుమికబోయెడి శత్రుఘ్నుని చేయి పట్టుకొని ఆపి శ్రుతకీర్తి దానికి ముందుగా మీయెదుట నిలచియున్న మీ పాదదాసి శ్రుతకీర్తి తలనరకి చంపుడు. తరువాత నా కుబ్జ పనిపట్టవచ్చును, అని మెడవంచి భర్తయెదుట నిలిచినది. శత్రుఘ్నుడు వ్యాకులపడి చేతికత్తిని విసరివైచి వచ్చి 'దేవీ! పాపముల జేసిన వారిపై జాలిదలచుట న్యాయము కాదు. నీ ప్రవర్తన జూడగా స్త్రీలయందు గల పక్షపాత బుద్ధి నీచేనిట్లు చేయించుచున్నట్లున్నది.

సుకుమారుడగు భరతు డావిధముగా నేడ్చుటకు కారణమెవరు? తన కోర్కె తీర్చుకొనుటకు రాము నడవికి సన్యాసిగా జేసి పంపిన దెవరు? ఇట్లందరి హృదయములలో రంపపుకోత బెట్టిన దెవరు? ఈ మంథర కాదా? అయ్యో! ఈ దుఃఖ బాధ భరింపలేను. ఇంకేది దారి?

రామ దర్శనమునకై నడవులకు వెళ్లవలెనని నగర జనులందరు నుత్సాహ పడుచున్నారు. దేవీ! ఇట్టి మంచి వార్త నీకు జెప్పవలెనని వచ్చితిని. నీమనస్సు దాసిపై నిలచినది, కాని సీతారామ దర్శనమున కెంతమాత్ర మారాటపడుట కనిపించదు. భరతునకు ప్రాప్యుడు, ప్రాపకుడు కూడ రాముడే. భరతునితో నాకు గల దగ్గర సంబంధము చేత రాముడు నాకు కూడ ప్రాప్యుడైనాడు. ఈ

బాంధవ్యములు పరమ విలక్షణమైనవి. వీని కారణముగానే వారిరువురి స్థితి జూచి నేనును వ్యసనపడుట కంటె మరేమియు జేయలేకున్నాను.

'రామ భరతులిద్దరు నాకు అన్నలే. వారిద్దరి యందును నాకభిమానమే కలదు. ఇరువురును నాచే పూజలందుకొన దగిన వారే. అయినను ఎందుచేతనో చెప్పలేను గాని నేను శ్రీరామునెప్పుడును తేరి చూడలేదు. నా దృష్టి భరతుని పాదసేవ పైనే ఉండును. అందుకే నాకింత తాపము కలుగుచున్నది. అతనిని వదలలేక, అతడు భగవద్భక్తులలో నుత్తముడని వానితో వాని మేనమామల యింటికి గిరి వ్రజమునకు కూడ వెళ్లితిని. మనుష్యులందరిలో రాముడే మానవాతీతమైన ప్రభావము కలవాడు. అయినను రాముని ముఖమును తేరి చూడ జాలను. చూచుటకు ధైర్యము చాలదు.

నేను లక్ష్మణుడు నేకోదరులమే, సుమిత్రా తనయులమే, ఐనను మా యిద్దరిలో నొకరిపై వేరొకరి కంటె, భరత రాముల పైననే ప్రేమయధికము, రామసేవకు లక్ష్మణుడున్నాడు కదా! తల్లియైనను సుమిత్ర మమ్మె పుడును లాలించి పోషించలేదు. పెద్ద వానిని రామునికి, నన్ను కైక పుత్రునికి సమర్పించినది. ఆమెకు మమకారమే యున్నచో తన పుత్రుడు లక్ష్మణుని అరణ్యవాసము జేయుటకు పుట్టినవాడని అనగలిగెడిదా?

ఆమె లక్ష్మణుని వాని అన్నతో పదునాలుగేండ్లడవిలో నుండుమని పంపినది. అట్లడవులకు నెట్టుట తల్లి చేయదగిన పనియేనా? ఇది కన్న తల్లి తత్త్వము. ఇది యిట్లుండగా సవతి తల్లికి రామునిపై ప్రేమయా? దేవీ! శ్రుతకీర్తి! నీవు నీ విశాల నేత్రములతో జక్కగా చూడగలవు. కాని యాబ్రహ్మనీకు వినదగిన జెవుల నిచ్చినట్లు లేదు. అట్లిచ్చియున్న యెడల నా మాటలన్నియు విని జవాబు చెప్పియుందువు. నన్ను జీవితాంతము నిట్లు చింతించుచు నుండమందువా? నీకు భరతునియందు భక్తి శ్రద్ధ విశిష్ఠ గౌరవము కలవని నేనెరుగుదును. ఆ భరతుడే భరింపరాని నింద తల పై బడినదన్న బాధతోనుండగా, నీవే మాత్రము

కలత పడవు, కన్నీరు పెట్టవు. ఆహా! నీదెంత రాతి గుండెయో కదా! రాముడడవికి వెళ్లు సమయములో నిద్దరుకాక మిగిలిన వారందరు కంట నీరు పెట్టిరట. వారిరువురు నెవరందువు? అట్టి వారు కైకయు నామె దాసియుగాక మరెవ్వ రందువు? నాకు నీవును వారిద్దరి వంటి దానవే ననిపించుచున్నది. ఎవరి పైనను నీకు వీసమెత్తు ప్రేమకాని జాలికాని లేవు.

'భరతుడు మేనమామల యింటికి వెళ్లునపుడు నాపై గల యకారణ వాత్సల్యము చేత ప్రేమతో తన పాదరక్షగా తీసుకొని వెళ్లెను. దానిని నా భాగ్యముగా భావించుచున్నాను. భాగవతులపై గౌరవాభిమానములు అదృష్టము చేతనే కలుగును. అట్టి భాగవత శ్రేష్ఠుని కింతటి బాధ కలిగినది కదా? దానినేట్లు చూచుచు నుండగలను? అది నాకు సాధ్యము కాదు. నేనెక్కడికైనను పోయెదను. మీ యభిమానపాత్రురాలైన ఆ గూని మాతంగి మంధరనే గద్దె యెక్కింపుడు." ఇట్లు పలికి కండ్లనీరు నించుచు వెడలిపోజూచుచుండగా, శ్రుతకీర్తి యతని కడ్డుగా నిలచి, యతని పాదములపై బడి 'ఈ శ్రుతకీర్తి మీ దాసురాలు, దీనిపై కోపగించెదరా?" అని లేచి పైట కొంగుతో భర్త కన్నీరు తుడిచి ప్రేమతో నతని జేయిపట్టుకొని తీసుకొని వెళ్లి రత్నపీఠము పై గూర్చుండ బెట్టి వీవనతో విసరి శ్రమ దీర్చినది. ఆ తరువాత భర్తతో నిట్లనినది.

'స్వామీ! నాపై నింత ఆగ్రహమెందుకు? కష్టమైనను సుఖమైనను మీ బాటలోనే నడచితిని, నడచుచున్నాను, నడువ గలను. ఈ దాసురాలు మీమాట కెదురు చెప్పగలదా? అయోధ్యలో జరిగిన రహస్యము లెన్నోయున్నవి. వానిని జెప్పెదను. ఆలకించ గోరెదను. దీనిని మిమ్ము వ్యతిరేకించుటగా భావించవద్దు" శత్రుఘ్నుడాశ్చర్యముతో కన్నులింత చేసుకొని, ఆమెను చూచుచు 'అవియేవో చెప్పు' మనెను. శ్రుతకీర్తియును ముద్దుగాను, మెత్తని గులాబిపూవు వలె కోరికల బొంగజేయుచు భర్త దగ్గర మెరపు తీగవలె నిలచెను.

అతడామెను నిత్యము చూచుచునే యున్నను నేడామె ముఖముపై

వ్యాపించున్న ముంగురులు, ఆమె వెడల్పైన చక్కని కన్నులు, ఆమె నల్లని తలవెంద్రుకలు, సంపంగిని పోలిన ఆమె ముక్కు ఎఱ్ఱని ఆమె పెదవులు స్నిగమైయున్న ఆమె నుదురు శుత్రుఘ్నుని కామెయందు క్రొత్త యందములను కనిపింప జేయగా ఆమె నొక అపూర్వ వస్తువుగా జూడసాగెను. ఆ సమయమున నామె చక్కదన మద్భుతమై యుండెను. ధరించిన ఆమె హారములలోని మణుల కాంతులు కోమలమైన ఆమె శరీరము పై వ్యాపించుచుండెను. అట్టి శ్రుతకీర్తి మనోహరముగా నున్నదని అనినచో – అది ఉన్నది ఉన్నట్లు చెప్పుటయే అగును.

ఆమె చేతులు లేత తామర తూడులకు సుకుమారత నేర్పుచున్నవి. ఉన్నదా? లేదా యని ఊహించుటకు సాధ్యము కానిది – ఆమె నడుము. సన్నని మెరుపు తీగవంటి శరీరము పై నుండి క్రిందివర కామె మెత్తని వస్త్రము ధరించియున్నది. కనులలో నొక యపూర్వకాంతి తళుకు మనుచున్నది. చెవులకు ధరించిన ఆభరణముల కాంతి చెక్కిళ్లపైకి వ్యాపించుచున్నది. వివేకమే రూపుదాల్చి వచ్చినట్లామె భర్త యొద్ద నిలచి యున్నది. లోకములో అనుపమాన రాజయోగులుగా పేరొందినవారు జనక వంశము వారు. వారిలో కుశధ్వజుడు ప్రసిద్ధుడు. ఆమె యతని ముద్దుబిడ్డ. కనుకనే యోగవాసన లామె యందు విలక్షణముగా కనిపించు చున్నవి. ఆ వైలక్షిణ్యముతో అపూర్వశోభతో శ్రుతకీర్తి భర్త యొద్ద నిలచి యున్నది.

అయోధ్య రాజవంశములో పూర్వమెప్పుడో ఇక్ష్వాకుని కాలములో యోగవిద్య నష్టమైపోయినది. కాని చక్కని వైష్ణవ సంప్రదాయ సిద్ధమగు శోభ రంగనాథుని రూపమున లభించినది. ఇట్టి ప్రసిద్ధి సంప్రదాయములు కల ఈ రెండు వంశము లను కౌశిక విశ్వామిత్రుడొకటిగా చేసినాడు. ఈ బంధము విలక్షణమైనది.

రెప్పవేయక తన వైపే చూచుచున్న శత్రుఘ్నుని చూపు నుండి తన దృష్టి మరలించి, శ్రుతకీర్తి ప్రతిపదమును ఆశ్చర్యము కలిగించునట్లు పరతత్త్వమును వివరింప సాగినది.

'ఆర్యపుత్రా! మంధరపై కోపమెందుకు? కైకేయీ మాతపై మాటలు విసరుటెందుకు? మీకు నమస్కరించి చెప్పెదను. మంధర మనసులో నపూర్వమైన దేవరహస్య మున్నది. అది నలువైపుల వెల్లడియగుచు వచ్చి యీనాటికి చేజిక్కినది. మంధర దైవ కృపాసిద్ధినందిన దాసి. దాని ఆలోచన సామాన్య మానవుల కంతు పట్టనిది. అతి పవిత్రమైన నాయాలోచనను కైకమ్మ గ్రహించినది. సర్వ సద్గుణ ధాముడైన శ్రీరాముడు గ్రహించినాడు. అత్తగారు, భూపుత్రి సీత, మునులు, గురువులు, దేవతలు, మాయక్కలు, మీరు, మీ యితర సోదరులు, దశరథుల వారు, పెద్ద రాణి కౌసల్యాదేవి, జ్ఞానియగు సుమంత్రుడు, రాజ్యములోని ప్రజలు, శ్రోత్రియ బ్రాహ్మణులు, స్త్రీలు వారు వీరనక అందరును రాబోవు ఫలితములు వెల్లడియగు నంత వరకు మంధర నిట్లు తిట్టుచునే యుందురు. దీనికి కారణము దైవతత్వమును గుర్తింపక పోవుటయే.

మంధర వీరిలో గొప్ప గుణవంతురాలు. ఆమె యెక్కడ పుట్టినదో ఇచట కెందుకు వచ్చినదో, ఎట్లు వచ్చినదో తెలియని వైనను, దానికి నేను నమస్కరించెదను. రఘువంశపు పేరు చందనపు వాసనవలె కైకేయీ భవనము నుండి అన్ని దిక్కుల కామె మూలమున వ్యాపించుచున్నది. మంధరపై నెవరు మాటగాని కత్తిగాని నేది విసరినను రాముడు మాత్రమంగీకరించడు. అతడు దివ్య దృష్టి కలవాడు. విశ్వామిత్రుని సేవలో కాకలు తీరినవాడు. కైకయు మంధరయు నతనికి రెండు కళ్లు.

'మంధర దేవతల కృపతో శోభిల్లుచున్నది. ఆ మహాత్మురాలు మీపినతల్లి కైక యొద్ద దాసిగా జేరుటొక యదృష్టము. వరముల మాట యెత్తి రఘురాము నడవులకు బంపుమనియు, రాజ్యము భరతున కిప్పించుమనియు కైకకు తత్త్వము దెలియ జెప్పిన దామెయే కదా! ఆమె రామునడవుల కెందుకు పంపినది? అసూయచే మాత్రము కాదు. గొప్ప పరమార్థము గోరి యీ పని జేసినది. భరతునకెందుకు రాజ్యమిమ్మనినది? మీ తండ్రి యా రహస్యమును తెర మరుగు

జేయ యత్నించినను, సత్యమెప్పుడును దాగదు, వెల్లడియై తీరును.

ఇక్ష్వాకుల నాటి మహా సామ్రాజ్యములో నడవులన్నియు రాక్షసుల జేతికి చిక్కి వారి నివాస భూములైనవి. పర్వతములను వానరు లాక్రమించుకొనిరి. ఇక సముద్రమో? రావణుని యాజ్ఞకు లోబడినది. రాజ్యమంతయు నిట్లు పరుల పాలై పోయినది. దానిని తిరిగి సంపాదించుటకే కైక యీ పట్టుదల జూపినది. ఆమె రాముని దండకారణ్యమున కేల వెళ్లవలెనని కోరినది? ఆమె భర్తతో కలసి యుద్ధమునకు వెళ్లినప్పుడే అచట జేరిన రాక్షసులు మునులను బాధించు చుండుట జూచినది. రాముని విలువిద్యా పాండిత్యమును గురించి తెలుసుకొని నది. పోగొట్టుకొనిన ఇక్ష్వాకుల రాజ్యమును తిరిగి సంపాదించుట రాముని వలననే సాధ్యపడునని తలచినది. రాముని దండకారణ్యమునకు పంపవలెనను కోరిక ప్రతిఫలమిదియే.

'దండకలో నివసించు మునులు తమ పుణ్యములో నారవ భాగమును కప్పముగా జెల్లించుచున్నారు. మీ తండ్రి దానిని గ్రహించుచుండెను. కాని వారి కష్టముల గురించి పట్టించు కొన్నది లేదు. మంథర రామునరణ్యమున కంపుమని కోరుమని కైకకు జెప్పుట - రాజు బాధ్యతను నిర్వర్తించునట్లు చేయుట, మునుల బాధలను నివారించుటయను రెండు ప్రయోజనములను సాధించుటకే, కైకతో వివాహ సమయమున మీ తండ్రి చేసిన వాగ్దానమును వినుడు, కైకకు పుత్ర సంతతి కలిగినచో వానికే తన రాజ్యమిత్తుననెనట. దానినే యిపుడు మంథర వరముగా కోరుమనినది. ఇది మీ తండ్రిని మాట నిలుపుకొను సత్యవాది యను పేరొందునట్లు చేయుట కొరకని తెలియుట లేదా?

'ఆగ్రహమును వదలి దూరదృష్టితో జూడుడు. మంథర మాటలలో మంచి మీకును కనిపించ గలదు. మనలో మన మాటగానొక సంగతి జెప్పుదును. కోపింపరు కదా? తన తల్లితో నామె పుత్రుడు భరతుడెన్నడైనను ప్రేమతో మాట్లాడెనా? మాతృ వందనము మాతృసేవ ముందుగా జేయవలసి యుండగా,

వానిని వదలి చేసిన దైవ సేవ ఫలించునా? కేకయులెంతో ప్రసిద్ధిపొందిన చరిత్రలు కలవారు. బ్రహ్మ విద్యలో నందెవేసిన చేతులు వారివి. వారు దేశికులుగా నుపదేశముల నిచ్చియుండిరి. వారి వంశములో కైకమ్మ పుట్టినది. ఆమె యాత్మతత్త్వమును దైవశక్తి గల రాముడు తెలుసుకొనినాడు.

'ఇట్లెంతయో యోగ్యురాలైన కైక వద్ద నెంతయో వివేకముతో మెలగి ఆమెకు మిక్కిలి యభిమాన పాత్రురాలైన దాసిగా మంధర పేరుపొందినది. ఎవరెంతగా తిట్టినను, ఎవరు తనపై కత్తి దూసినను, ఏ చెడు ఆలోచనలు లేని మంధర మీ వంశ ప్రతిష్ఠ ప్రకాశింప జేయుటకే తన జీవితమును ధారపోసినది. ఇచ్చిన వరములను నిజము చేయుమని యడిగించి నందు కామెను చంప జూచుట న్యాయమా? ఆమె తన యజమానురాలి తత్త్వ జ్ఞానమును చక్కగా వెల్లడి చేసినది. కొందరది గుర్తింపకున్నను రామచంద్రుడు గుర్తించెనని ఆమెకు తెలియును. అది యామెకు జాలును.

ఆమె యొక వరముతో – కైకపుత్రుడెంతో ఉత్తముడు. వానికే మాత్రమును రాజ్యము పై నాశలేదని తెలియజేసినది. మరియొక వరముతో రామునరణ్యమున కంపి – రఘువంశ కీర్తిని, రాముడు మహావీరుడు – సుమీ! యని శత్రువులను తీవ్రముగా భయ పెట్టినది. మరియు మంధర మహత్వానుబంధముతోను, వాత్సల్యముతోను భరతుని ముంచెత్తి పెంచినది. భరతునికి రామచంద్రుని తామరపువ్వు వలె నెఱ్ఱనైన పాదముల దాస్యమును కనకాభిషేక ఫలితము కలిగించినది. ఇవి చాలవా?

ఆమె భరతునిపై పెంచిన మమకారము, రామునిపై ప్రేమాదరములు కలిగియుండుట యధార్థము – వీనికే మాత్రమును సందేహము లేదు. రామ భరతు లిద్దరును రాజ్యము పై వ్యామోహము లేని యోగ్యులని తేల్చి చెప్పినది. అందరు నన్నియు తెలుసుకొన లేరు. మంధర భరతుని భక్తిని, రాముని అమానుష వైభవమును – దైవకృప చేతనో పూర్వజన్మములో చేసిన పుణ్యము

వలననో – పొరజూడ గలిగినది –కైకను మోహ బంధములనుండి విడివడ జేసినది. పూర్వము దశరథుడిచ్చిన వరములను పుచ్చుకొనునట్లు చేసినది. రామభరతుల కిద్దరికి కీర్తి సంపాదించి పెట్టినది.

ఆమె పరుల మేలు కోరినది. తామర మొగ్గగా నుండగా దాని సుగంధము వెల్లడికాదు. ఎవరును గుర్తింపలేరు. అట్లే మంధర హృదయము నెరుగ లేకయు, కైక హృదయమును గుర్తింప లేకయు భరతులవారా యిద్దరికి శాపములు పెట్టుచున్నారు. మీరును తొందరపడి దాసిని జంపుటకై కత్తి దూసితిరి. మీకేమి చెప్పగలరు? పరమ భాగవతులని పేరుగల బావగారికి కోపించుట తగునా? కష్ట సుఖము లేవి కలిగినను వాటిని లెక్కించక ఒకే విధముగా స్వీకరించుటయే భాగవత ధర్మముకదా! మాతృదేవత ననరాని మాటలాడుట వలనగాని, కత్తిదూయుట వలన గాని కలిగెడు ప్రయోజన మేమున్నది?

'శత్రుఘ్నప్రభూ! ఆనాడు పరతత్త్వ వాసన లెరుగక భరతులవారు తల్లిని దూషించినారు. అకారణముగా కోపించి తీవ్రముగా జూచి, ఈసడించి, అపవాదులు వేసినారు. మాతృ గౌరవము జూపక, మాతృసేవ చేయక, అమె యందాదరము చూపక, ఏ పుత్రునికైనను మన్నన ఔన్నత్యము లభించ గలవా? ఎంత మనశ్శాంతి, విరక్తి కలిగియుండవలెను? కోపమును నిగ్రహించుకొని ప్రవర్తించ వలెను? ఆనందము, విషాదము ఏవి ప్రాప్తించినను ఒకే తీరుగా ఆత్మనిగ్రహము ప్రదర్శించ గలవారే పరమ భాగవతులని పించుకొన గలరు కదా!

కైకను, మంధరను చూడుడు. కాకి మూకల వలె జనులందరు చేరి కఠోరముగా నెన్ని కూతలు కూసినను వారేమియు వ్యాకులపడ లేదు. వారు భాగవత శ్రేష్ఠులుగా జెప్పదగిన వారు. రాముడు మెచ్చినందుకు వారుఉబ్బిపో లేదు. మీదూషణల నన్నిటిని సహించినారు. దీనికి వారు లోకక్షేమము కోరుటయే కారణము. ఈ వరములలోని అంతర్యము పరికించుడు. కైక రాముని అడవులలో

పదునాలుగేండ్లు ఉండవలెనని గడువు విధించుటలోని ఆంతర్యమును చూడుడు తన పుత్రుడు పదునాలుగేండ్లు పాలించవలెననియు నాకాలమున రాముడు అడవులలో నుండ వలెననియు కోరెను. ద్రోహబుద్ధితో నైనచో జీవిత కాలము రాముడడవులలోనే ఉండవలెనని కోరియుండెడిది కదా!

'ఎవరికి గాని దగ్గరనే యున్నచో ప్రేమ కనిపించదు. రాముడిచ్చట నేయుండి రాజైనచో రామతత్త్వ మీ విధముగా లోకము గుర్తించి యుండెడిదా? దూరమైనందుననే ప్రజల మనసులలో ననురాగ భావము పెరిగెను? కీర్తి దట్టముగా వ్యాపించినది. రాముడు సర్వాత్ముడని, ఈ భూజనుల నుద్ధరించు పనికై అవతరించిన పరంధాముడని మంథర గుర్తించినది. అది యీనాడు కాదు, బాల్యమున రాముడు చేత ధనుర్బాణముల ధరించి యాగరక్షణకై కౌశిక ఋషి వెంట కాలినడకను వెళ్లిననాడే ఆమె కిట్టి నమ్మిక, ఆశ కలిగినవి.

'రాముని అసలు స్వరూపమేదో విశ్వామిత్రుడు రాజు దశరధునికి వివరించిన నాడే 'ఔరా! రాముడింతటి వాడా? సాక్షాత్పరాత్పరుడా? అని కుబ్జ మనసులో మెప్పు, ప్రేమ, గౌరవము, భక్తి, శ్రద్ధ, వీని వలన జ్ఞానము పొందినది. ఈ భగవదవతారమునకు తాను చేసి తరించగల సేవయేది? యని ఆలోచించి, దానినీ విధముగా పొందగలిగినది. రాముడు తాటకను చంపి నాడనగా సంతోషము పొందినది, సుబాహుని జంపినాడనగా మెచ్చుకొనినది. మారీచుని – మదమణచె ననగా పొంగిపోయినది. ఈ నాటికి సూర్యవంశములో నొక మహా ప్రభుని జూచితినని తాండవము చేసినది.

'రాముడు శివుని విల్లు విరచెను, సీతను పెండ్లాడెను, దారిలో పరశు రాముని గర్వ మణచెను. అని ఆనందించినది. ఈ యమానుష వైభవముతో నేల మొత్తముగా తరించి పోవలెనని మంథర యీ పనికి పూనుకొనినది. భరతునికి పట్టాభిషేకము చేయించినచో సత్యసంధులను కీర్తి రఘువంశ రాజులకు నిలిచి యుండును. పరంధాముడైన రామునడవులకు పంపినచో

పితృవాక్య పరిపాలకులను ప్రసిద్ధి సూర్యవంశము వారికి మిగిలియుండును. ఈ తలపులతో కైకయు, మంధరయు జేసిన పనులు పొగడ దగినవి కదా!

'స్వామీ! కాసుకోసమై చెడ్డ పనులు చేయుకాలమయోధ్యకు దాపురించిన దంటిరి కదా! ఆ కాసును కోరెడివారెవరు? వారు మీ తండ్రి దశరధుల వారు మాత్రమే. తాను చేసిన ప్రతిజ్ఞలు, ఇచ్చిన వరములు మరుగున బెట్టి కైకను మోసము జేయ జూచిన దాయనయేకదా! లోకులీ విషయమెరుగరు. తరతరాలుగా నిక్ష్వాకు వంశము వారెన్నడును ఆడితప్ప లేదు. నీకుమారునే రాజును చేసెదనని కైకకు మాట యేకాదు, వరములును ఇచ్చి మాయజేయ జూచినది దశరధుల వారే. దీనిని సత్యపాలన అందురా?

'అయ్యో! మారఘువంశపు రాజు అనిన మాటను కాదనుచున్నాడు, ఈ యన్యాయము అంధకారము వలె వ్యాపించుచున్నది, సత్యము కనిపించుట లేదుఅని మంధరకు తోచి యుండును. కైకమ్మను నిద్రలేపినది. కొడిగట్టిన రఘువంశ జ్యోతిని వెలిగించినది. చీకటిని పారద్రోలినది. రాముడు తలిదండ్రులను శ్రద్ధాభక్తులతోను, ప్రేమతోను సేవించువాడు, అన్నియు గ్రహించగలవాడు. సత్యమేమో గ్రహించి, 'సరే' యని అడవులకు వెళ్లినాడు. కొందరెందు చేతనో ఈ సత్యమును గ్రహించరు. దూషణల కారంభింతురు. వారిని ఏమనగలము?

'రామా! భరతుడు రాకముందే నీకు పట్టాభిషేకము జేసెదనని మీతండ్రి రామునకు చెప్పెను. కైకేయీ పుత్రుని దాచి పెట్టెననియు, నిదియన్యాయ మనియు తలచిన మంధర, మొత్తము రహస్యమును కైకకు జెప్పి బట్టబయలు చేసినది. ఇది దోషమా? కేకయ రాజు మీ తండ్రికి పిల్ల నిచ్చిన మామకదా! వారికెందుకు కబురు పెట్టలేదు. భరతుని, మిమ్మురప్పించుమని సుమంత్రనితో మాట వరుసకైన ననలేదే. వియ్యంకులు జనకునికి కుశధ్వజునికి వార్త పంపెనా?

అదియును లేదే! ఇక్ష్వాకు వంశపు రాజపట్టాభిషేక మనగా సామాన్య కార్యమా? మీకివి యన్నియు న్యాయముగా తోచుచున్నవా?

'మనసులో మోసమును దాచి, పౌరులను సంప్రదించినట్లు నటించి రాముని రాజుగా జేయజూచెనుకదా! ఇది అన్యాయము, అసత్యము కాదా? దీనిని గ్రహించియే మంథర పట్టాభిషేకమును భంగపరచి, లోకుల కిందు గల మోసమేమో, పరమార్థమేమో యెరుక పరచినది. రాజు తాను చేసిన అపరాధముల మూలముగా మరణించెను, కాని మంథర చేసిన పని వలన మాత్రము కాదు. తమకు మరొక రహస్యమును కూడ విన్నవించెదను, స్వామీ! వినుడు. స్త్రీలయందు మోసము జేయుటయు నసత్యమాడుటయు, మాట దప్పుటయు శాస్త్రము చెడుపనులుగా చెప్పినవి. ఆ పనుల జేసిన వారికి తేజస్సు నశించును, సుఖజీవనము, శాంతి దూరమై పోవును.

ఉరకలు వేయు వయసున మామగారొక పాపము చేసినారు. నది యొడ్డున నొకచోట చీకటిలో పొంచియుండి శబ్దబేధియను ఆయుధ విద్య నుపయోగించి యొక మునిబాలుని జంపినారు. ఇది యింత వరకు వెల్లడి కాలేదు. మీ తండ్రిగారే తమ మరణ వేదన సమయమున దీనిని బయట పెట్టినారు. ఆ బాలుని తలిదండ్రులు మిక్కిలి ముసలి వారట. ఆ ముని 'మాకాధారమైయున్న బాలుని జంపిన పాపమునకు నిన్ను తలపగులునట్లు శపించవలసినదే. అయినను నేనాపని జేయుట కిష్టపడను. నావలె నీవుకూడ, ఓ దశరథా! పుత్ర వియోగ బాధతో మరణింతువు, ఇది తప్పదు, అని శపించెనట.

'యౌవనములో జేసిన పాప మిప్పుడు దారుణముగా చుట్టుముట్టి మృత్యువై ప్రాణములు తీసినది. శత్రుఘ్న ప్రభూ! ఎంత వారికైనను చేసిన కర్మల ఫలితమును అనుభవించక తప్పదు కదా!

'సంతానము లేక ఎన్నో కష్టములు పడిన తరువాత, యజ్ఞము చేసి, దాని ఫలితముగా మీవంటి మహాత్ములగు పుత్రులను పొందినారు. అంతతో

సంతోషపడి రాజు ఊరకొనలేదు. భరతుని మిమ్ము దూరముగా బంపినాడు. మిగిలిన యిద్దరిని కారడవులకంపి వియోగ బాధతో మృతి పొందుట కర్మఫల మనుభవించుటయే కదా! కనుక మీ తండ్రిగారి మృతికి వారి కర్మఫలమే కాని వేరెవరును కారణము కాలేరు. అట్లే భావించ వలసి యున్నది కదా! ఇందులో మంధర దోషమే మున్నది? అన్నియు దైవనిర్ణయము ప్రకారమే జరుగును. పుత్రులెవరును దగ్గర లేకుండ మృతి బొందుటయు దైవనిర్ణయమే అగుచున్నది. ఆర్యపుత్రులీ సత్యమును లోతుగా పరిశీలించవలెను.

'తల్లిదండ్రుల మాట పాటించుట పుత్రధర్మము. రాముడు తండ్రి వాక్యము ప్రకారమే అడవులకు వెళ్లెను. దానిని దోషమందురా? తల్లి మాట ప్రకారముగా, తండ్రి యొప్పుదలను తలదాల్చి వెళ్లెను. దానిని దోషమనరు కదా! తన తల్లి నెవరును ఏమియు ననరాదని చెప్పి వెళ్లెను. అది దోషమగునా? మీయన్న రామచంద్రుడు దోషములగు పనులజేయునా? తానెవరో, ఏమి చేయవలెనో మీయన్నకు తెలియదా?

రాజ్యము పొందినను పోయినను రామిని కేమి? ఆయిన పరమ ప్రసిద్ధుడు. పురుషోత్తముడు. అడవులలో ప్రేమ స్వరూపులైన మునులు, పక్షులు జంతువులు నతనికి సంతోషము కలిగించునవి. తన యవతార రహస్యమును మరుగుపరచి కార్యసాధన చేయగల సాధనములు. మాయత్త సుమిత్రాదేవికి తన ఇద్దరి పుత్రుల తత్త్వము బాగుగా తెలియును. అందుచేతనే వారిని వారికంటె పెద్ద వారిద్దరి పాదముల వద్దను సమర్పించినది. దీనితో శేషత్వము, పారతంత్ర్యము, సేవావృత్తులు నేర్చుకొని వారిద్దరు వృద్ధిలోనికి రావలెనని తలచి యుండును. 'మీ తల్లి స్వభావమేమో? మీరెరుగుదురా? ఎరుగరు కదా! జరిగినది చెప్పెదను వినుడు. రామునితో తన పెద్ద కుమారు నడవులకు పంపునప్పుడామె యేమనినది? అడవులలో త్రోవలు చూపుచు వనవాసము చేయుటయే లక్ష్మణుడు పుట్టినందుకు ప్రయోజనమనినది. నిజమునకు వనవాస ప్రయోజనము

రామచంద్రునికే కదా! ఒక్కొక్కని కొక్కొక్కనిపై నభిమానము కలుగుననుట తెలిసినదే. ఆ మక్కువ తమంత తాముగా కలిగించు కొనెడిదికాదు. ఇందుకు పైకి కనుపించు కారణము మాత్రమే కాక, మరుగుననుండినను పూర్వమే నిశ్చితమైన వేరొక కారణము కూడ తప్పక ఉండగలదు.

'యజ్ఞఫలముగా లభించిన పాయసము విషయమే తీసుకొనుడు. పెద్ద భార్య కౌసల్యకు ముందుగా నిచ్చిరి. మీ తల్లి భాగము తరువాత కైకమ్మ కిచ్చిరి. ఆ తరువాత మిగిలిన దానిని కూడ మీ తల్లికి రెండవ మారిచ్చిరి. మీ తండ్రి యీ చర్యను బట్టియే రామలక్ష్మణులకును; మీకు భరతునితోను స్నేహము మమతాను బంధములు కలిగినవి. 'మా తల్లి కైకకు భర్తపైనే మాత్రము గౌరవము లేదు, మాకు తండ్రిగానుండు నర్హత దశరథునికి లేదని బావగారు క్రోధముతో ననిరట. ఆ మాటలు సుమంత్రుడు రాజుతో చెప్పెనట. అందుకు మీ తండ్రి యెంతగా క్షోభపడెనో మీరెరుగుదురా? భార్యాభర్తల సంబంధములతి గోప్యములైనవి. భార్య తన కోరిక దీర్చుకొనుటకు భర్తను ప్రార్థించును. ప్రణయకోపము జూపును, మాటనేర్పరితనము ప్రదర్శించును, తర్కించును, ప్రేమ నింపు చూపుల జూచును. పొగుడును లేక యేదేనొక విధముగా భర్తపై కోపము జూపును. ఇవి యన్నియు భార్యాభర్తల మధ్య రహస్యముగా నడుచు ప్రక్రియలు.

కోపముచే కాదని అనుకొనుడు, ప్రణయ కోపముచే నైయుండును. మా అక్క మైథిలియు భర్తనన కూడని మాటయేదో అనినదట. కాని రాముడు దానికి బాధపడ లేదే. ఎందుచేత? ఆ మాట ప్రేమతో కూడిన కోపముచే పలికినది కనుక. కాని పితృపుత్ర సంబంధము లట్టివి కావే! కోపముచే తండ్రి ననరాని మాటలనుట మీయన్న లక్ష్మణునికి తగునా? మీరే చెప్పుడు?

'రాముడు యోగియైనాడు. మీయన్న లక్ష్మదును యోగియై అనుసరించినాడు. భరతుని కూడ యోగియై అడవులకు వెళ్లనిండు. అది మంచిదే. ఇట్లు ముగ్గురు

సోదరులను యోగవిద్యలో ఉద్ధరింప నిండు. ఇక్ష్వాకుల నుండి మీ వంశమున నష్టమైపోయిన యోగ సంపద మరల లభించగలదు. భరతుడును జడలు, కాషాయములు ధరించి యడవులకు వెళ్లుట తప్పదని తెలియుచునే ఉన్నది. ఇకనీ రాజ్యభారము మోయువారిచట నెవరుందురో మీరే గ్రహించవలెను. నాకై నేనెందుకు చెప్పవలెను?

'ఆ ముప్వురు మీకు పూజింప దగినవారే. గురువులుగా గౌరవించదగిన వారే. వారి యాజ్ఞలు మీరు నెరవేర్చినచో జీవన ఫలము సిద్ధించినట్లే. యోగము ఫలించినట్లే. ఇదియునొక యోగమే. వస్తువు యోగ్యమైనదే ప్రభూ! భరతుల వారికి రాజ్యభారము పాపముగా దోచినది. కాని కైకకు, మంధరలకో? ఇది పరమ ధర్మమనిపించినది - భూభారము తీర్చుటకై రాముడడవులకు పంపుటకును, చెడువారిని శిక్షించుటకును, మంచివారిని రక్షించుటకును ఇది ఉత్తమ సాధనము కదా!

'అందుకే నాయనా! భరతా! రామునడవికి పంపితిని. నామాట విని పదునాలుగేండ్లు మాత్రము రాజ్యమునకు కావలి కాచియుండుము' అని తల్లి గట్టిగా చెప్పినను భరతులవారెంత మాత్రము నొప్పుకొనలేదు. దీనికి మీ సోదరు లిరువురకు తత్త్వజ్ఞానము లోపమగుటే కారణము కదా? ప్రభూ! ముక్కోటి దేవతలు నొకటిగా మంధర నావేశించి, వారి భావముల నామెచే కైకకు చెప్పించిరి. కైక పంతము పట్టినది. ఇప్పుడు కాకపోయినను ఆ తరువాత నైనను మీరును ఈ విషయము గ్రహింతురు. అది తప్పదు. రాముడీ విషయమును ముందుగానే గ్రహించెను. కనుకనే మంధర, కైకల, దేవతల యత్నములు ఫలించినవి.

'రాము డడవులకు వెళ్లిన తరువాత అయోధ్య అడవియైనది. దానికి కారణము కుబ్జయే కదా! మీ తల్లి లక్ష్మణునడవులకు పంపునప్పుడేమనెను? అడవినే అయోధ్యగా భావించుమని కదా! తొందరపాటుచే మీరు మంధరపై

పగబూనిన యెడల నేమగునో, అందలి తత్త్వమేమో ఆలోచింపుడు. చైత్ర మాసము వచ్చినది, రాముని అభిషేకము చేయవలెనని అడవులన్నియు విరియ బూసినవి' అని దశరథుడన్నమాట మీరు వినలేదా? జరుగబోవు సంఘటనలు వాని ఫలితములు నీవిధముగా కొందరి నోళ్ల వెంట నిట్లే ముందుగా దైవము పలికించు చుండునని వినుచున్నాము కదా! రాముడడవికి రాగలడని ముందు గానే అడవి చెట్లన్నియు పువ్వులతో నిండి యుండుననియు, ఈ పట్టణము చీకటి రాత్రివలె కనిపించుననియు నీమాటల వలన ధ్వనిగా దెలియు చున్నదని మనలో మాటగా విన్నవించితిని. ఈ కారణములచే మంథరను కైకను కూడ గౌరవముగా జూడుడని మిమ్ము ప్రార్థించుచున్నాను."

శ్రుతకీర్తి భర్తపాదములపై తల నుంచి నమస్కరించినది. శత్రుఘ్ను డామెను సాదరముగా లేవనెత్తి "దేవీ! శ్రుతకీర్తి! నీవు మహోపదేశము చేసితివి. దీనికై నేనే నీకు నమస్కరించవలసియున్నది. నీవు పేరుకు మాత్రమే శ్రుతకీర్తివి కావని, విశ్రుతమైన కీర్తి కలదానవని పూర్వమే వినియున్నాను. నేడు ప్రత్యక్షముగా తెలిసికొన్నాను. నీ పేరు సార్థకమైనది" అని ఆమె చూపులతో తన చూపులు కలపి వానిలో నద్భుత ప్రకాశమును చూచెను.



# మాండవి

## (భరతుని భార్య)

అదియే సరయూ నది. దాని ఒడ్డున నదే పల్లెటూరు. రాత్రి సమయము, వర్షాకాలము, అర్ధరాత్రి దాటినది. మేఘముల ఫెళఫెళలు వినిపించుచున్నవి! అవే మెరపుల తళతళలు, ఈదురుగాలి – ఇవి యన్నియు కలసి యది ప్రళయము నాటి రాత్రివలెనున్నది. కాళరాత్రి కంఠమున ప్రకాశించు నీలమణి కాంతియా అనునట్లు చీకటి పరచుకొని యున్నది. అది దట్టముగా నుండి లోకమును భయపెట్టు చున్నది. దీనికి తోడు ఏనుగు తొండములంత లావుగా వర్షధారలు.

ఇటువంటి సమయమున ప్రయాణము చేయువాడెవడు? చావుకు తెగించిన వాని వలె ఆ నడక యేమి? జాగ్రత్తగా తేరి చూచిన యెడల ఆ నడకలో రాచఠీవి కనిపించుట లేదా? అగును గాక! వినయంగా తల వంచుట, ముఖము దాచుకొనుట ఎందుకు? జుట్టు రాగి తీగలవలె నెట్టనై ముఖముపై నాక్రమించి దానిని గప్పి వేయుచున్నది. అది తైల సంస్కారమునకు నోచుకొన్నట్లు లేదు. ముంగురులు ముఖము నావరించియున్నవి. ధరించిన ఉత్తరీయము నారతో నేసినదాని వలెనున్నది. ప్రాయమా? చిన్న వయసువలెనున్నది. ఈ యువ తపస్వి యెవడై యుండును?

మెరపుల కాంతిలో నతడు శ్యామల వర్ణపు వానివలె కనిపించుచున్నాడు. నీలవర్ణపు వాని ముఖము అందముగా నున్నది. ఈతనిని పోల్చలేకున్నాను. కండ్ల నీరు పెట్టుటచే వాని చెక్కిళ్లు మురికిగా నున్నవి. పరమశాంతునిగా

నున్నాడు. ఆ పదముల విన్యాసము, నిట్టూర్పులు – అవును ఇతడీమధ్యనే – ఈ గ్రామమునకు వచ్చినాడు. ఏన్నో యేండ్లు కాలేదు. ఈ నందిగ్రామమున నివాసమేర్పరచుకొన్న భరతుని వలెనున్నాడు.

ముఖమెత్తి చూచిన నెవరో సరిగా గుర్తింపగలము. కానిచో నెట్లు చెప్ప గలము? ఏదో ఆలోచనలో నున్నట్లు నడచుచున్నాడు. పాదములెచట పడుచున్నవో గుర్తించుట లేదు. సరయూనది సమీపించినాడు. అందు స్నానమా? మరేమి చేయును? రాత్రివేళ, ఈ ముసురులో నిటు రాకపోయిన నేమి మునిగి పోవును? ఓహో! మెరపు కాంతిలో స్పష్టముగా జూచితిని. ఇతడు భరతుడే సందేహము లేదు.

తన తల్లి కైకమ్మ వలన రాముడు వనవాసము చేయవలసి వచ్చెనేయన్న దుఃఖముతో చిక్కి శల్యమై ఈ నదీ తీరమందలి పల్లెలో కాపురము పెట్టినాడు. అదేమి శాపమో కాని వీని యన్న శ్రీరాముడును వీని కోరిక నిరాకరించినాడు. పాపము భరత ప్రభువుకు చిన్నవయసులోనే కాషాయపు గుడ్డలు ప్రాప్తించినవి. పగలు స్నానమునకు వెళ్లినచో చూచిన జనులు 'ఇడుగో! వీడే రామునడవుల కంపినట్టి కైకమ్మ కొడుకు!' అని దూషించెదరని రాత్రులందు వెళ్లుచున్నాడేమో?

'ఇటువంటి నిర్భాగ్యుని వలననే రాజ్యపీఠముపై కూర్చుండవలసిన మా రాముడడవుల బట్టి పోయెను. ఈ పాడు మొగము ఉదయముననే చూచుట మాకు దప్పునట్లు లేద'ని జనులు తిట్టుదురనియో? లోకులు అసహ్యించుకొను ముఖము వారికి జూపలేక ఏ ప్రవాహముననో మునిగి చచ్చుట మంచిదనియో? పాపము భరతుడీ సమయమున వెళ్లుచున్నాడేమో? అట్లు తలచియు నింతలోనే – రామచంద్ర ప్రభువు తాను తిరిగి వచ్చి సింహాసనమెక్కెదనని మాట యిచ్చినాడు కనుక తొందరపడి చావరాదని తలచుచు, ఏ నిర్ణయము చేసుకొనలేక, లోకనింద భరించలేక తపించుచున్న భరతుని స్థితి దయనీయము కదా!

అతడు చీకటిలో వెళ్లుచునే విషప్రాణియైన తనను కరచిన బాగుండునని తలచును; ఏ క్రూరమృగమైన చంపి తినరాదా యని తలచుచుండును. నీటిలో నే మొసలియో తననీడ్చుకొని పోయిన బాగని యోచించు చుండును. వీనిలో నే యాలోచనయు ఫలించుటలేదు. బలవంతపు చావు దోషముగా విధింప బడినందున నత డాత్మహత్యకు మాత్రము పూనుకొనుట లేదు. దశరథుడో? స్వర్గమునకు వెళ్లినాడు. రాజ్యము నేలగల రామచంద్రుడో? వనవాసము జేయుచున్నాడు. మనసున కింతయని చెప్పలేని బాధ కలుగుచున్నది. ఈ బాధలనన్నిటిని, పాపమా తపస్వి - భరతుడెట్లు భరించి, జీవించ గలుగుచున్నాడో?

కైక విధించిన పదునాలుగేండ్ల గడువు ఎప్పుడు పూర్తియగునో? ఈ పాపాత్ముని జూచుటకు రాముడెప్పుడు వచ్చునో? ఎప్పుడు అయోధ్యలో కొలువు దీర్చునో? ఎప్పుడు తానిచ్చిన పాదుకలలో పాదములుంచునో? - మనస్సీ యాలోచనల భారము నెంతమాత్రము మోయలేకున్నది. లేత చిగురుటాకో యనునట్లు నవయౌవన సంపదతో విలసిల్లుచున్న మాండవి తన పాదముల వద్దనే పడియుండి సేవలు చేయుచున్నను కనుసన్నలతో నామె నదల్చుచుండునే కాని నోటితో నొక మాట యైన నామెతో బలుకడు. ఈ యౌవనమున తన మనసునెట్లు బిగ పట్టుచున్నాడో కదా!

ప్రాయము పాలపొంగు వలె పొంగి వచ్చుచున్నను, మోహము నదుపులో నుంచుకొని - మాండవి - భర్త సమీపమున - కెరటములు లేని గంగా ప్రవాహము వలె నేవికారములు పొందక ప్రశాంతముగ నున్నది. ఆమె యాత్మ నిగ్రహములో నిస్సందేహముగా - నిస్సంగులైన ముని జనులేమాత్రము - సరికాజాలరు. విరాగములో బుద్ధి నెంత మాత్రమును నిలుప జాలని వయస్సామెది. ఆమె తన ప్రణయ దీపమును వేడి నిట్టూర్పులను గాలులచే నార్పివేసినది. కన్నీటిచే హృదయపు వెచ్చదనమును చల్లబరచుకొనినది. ఈ

భరతునకిప్పుడు స్త్రీ ప్రణయము నిషేధించబడిన వస్తువు. ఎక్కుపెట్టిన మన్మథుని ధనస్సా? యను నట్లుండెడి మాండవి, మణి భూషణముల వంటి యలంకారములు వదలి, కరువు చేత పీడించబడుచున్న సామ్రాజ్యము వలెనున్నది. ఈ విధముగా నామె భర్త ననుసరించి, యతని మనసును కరిగించ గలిగినది. ఉదయముననే విచ్చుకొన్న తామరపువ్వులా యనునట్లా కన్నులున్నను, వానిలో నేదో చెప్పలేని నిరాశ నివసించి యున్నది. కాని యామెకు పుట్టుకతో వచ్చిన దిటమైన మనసున్నది. అందుచే లోకులామెను గురించి చేయు ఊహాపోహల కెంతమాత్రము అవకాశమీయదు.

చక్కని నడుము నుండి కొంచెము దిగి జారిన మొలనూలును, ఒకే జడగా క్రిందకు వ్రేలాడుచున్న జుట్టును, పైన దుమ్ము పడుటచే కాషాయరంగుకు మారిన చీరెయు మాండవి పడుచున్న వేదనను విశదముగా జెప్పుచున్నవి. కాని ఈ గంభీరమైన వేషము భర్త వేషమునకు తగియున్నదని లోకులనుకొన వచ్చును. ఆమె 'నవ్వు' అనుమాటనే మరచిపోయినది. తైల సంస్కారములేక ముఖముపై వ్రేలాడు ముంగురులను చేతితో సరిచేసుకొనుట మానివేసినది. మాటను మూగపడ జేసినది. ఆమె పూర్వపు సౌందర్య చిహ్నములుగా మిగిలియున్నవి – చిక్కిన శరీరము, దాని పసిడి వర్ణము మాత్రమే.

ఆమె ముఖమున కొట్టవచ్చినట్లు కనిపించునవి – ఆమె విశాల నేత్రములు. పాపమామె భుజించి యెంత కాలమైనదో! ఆమె యిట్లు కృశించుచున్నను జాలిజూపువారెవరు? ఆమెది సీతారాము లడవులకు వెళ్లిరన్న బాధయా? భరతుడిట్లున్నాడన్న విచారమా? దొండపండు వంటి ఆమె ఎఱ్ఱని క్రింది పెదవి, వెచ్చని శ్వాసకు రంగు మాసిపోయినది. ఎడతెగక కండ్లనుండి క్రిందికి దిగజారుచున్న వేడి నీటి ధారలచే నామె చెక్కిళ్లు చారలు గట్టియున్నవి. వీటి కారణం సీతారామ వనవాసము గాక వేరేదియు గాదు.

భర్త జడలు ధరించి సన్యాసి వలెనుండగా భర్తయందనురాగముగల యే

స్త్రీ భరించుచు సుఖములు పొందగలుగును? సుఖపడదగిన వయసులో ఈ విధముగా తపస్సు చేయుటయా? ఇది న్యాయమగునా? ఇవి జాలి కలిగించునవి కావా? వీటి అన్నిటికి సాక్షులుగా మాండవీ భరతులు కనిపించుచున్నారు. భర్త స్నానమునకు వెళ్లి జాము గడచినను తిరిగి వచ్చుచున్న జాడలేదు. ఆమె మనసు పరిపరి విధముల బోవుచున్నది. తాను కూడ సరయూ నదికి వెళ్లదలచినది. గాలివాన, మేఘముల గర్జనలు, మెరుపుల తళతళలు ఎటు వెళ్లగలదు?

నదికి వెళ్లుదారి ముళ్లబాట. తాను ఉపవాసములచే నీరసపడి యున్నది. అడుగు పడనీయదు. పాదములా? లేత చిగురుటాకులవలె సుకుమారములు. ఎట్లు వెళ్లగలదు? నది నెట్లు చేరగలదు? అయినను భర్త పాదములందే మనసు నిలుపు కొనిన ఏ సాధ్వియైనను ఈ విధములైన ఆటంకములను లెక్కించదు కదా! జోరుగ వాన కురిసి మేఘములు కొంత శాంతించినవి. వాన తగ్గి సన్నని చినుకులు పడుచున్నవి. ఆకాశము, మబ్బులు తేరి తేజోవంత మగుచున్నది. కాని గాలి మాత్రమింకను శాంతించలేదు.

గాలికి ముంగురులు చక్కని ఆమె ముఖముపై వ్యాపించుచు తొలగుచు తుమ్మెదలవలె నున్నవి. ఒకవైపు భయము, వేరొక వైపు వేదన, ఇంకొకవైపు దుఃఖము నామె చూపులలో నిండియున్నవి. పైట కొంగు గాలికి ఉయ్యాలవలె నూగుచుండగా బంగారు బొమ్మవలె నామె సరయూనది వద్దకు వచ్చినది. ఆ తీరప్రాంతము నలువైపుల బారజూచినది. భర్త కనుపించలేదు. కన్నీరు వెచ్చగా హృదయము పైకి జారుచున్నది. నడచుట వలన కలిగిన అలసట ఆమె శరీరమును కంపింప జేయుచున్నది.

ఇంతలో నదీ తీరమున నొక రాతిపై మిక్కిలి దుఃఖముచే గలిగిన బాధతో కన్నులు సగము మూసియున్న భరతుడామెకు కనిపించినాడు. సన్నని వాన చినుకులు తుంపరలై మెల్లని గాలులచే నెగురగొట్టబడుచున్నవి. ఆమె లెక్కలేనన్ని

చిదుపలై సూర్యకిరణముల కాంతులు తమపై పడగా కాషాయవర్ణము పొందుచున్నవి. అవి భరతుని తలపై విహారము చేయుచున్నవి. ఎఱ్ఱబారిన భరతుని జుట్టు వీనితో గలసి వింత శోభనిచ్చుచున్నది. తన చెక్కిళ్లకు చేతులు చేర్చి, నదీ కెరటములు తాకుచున్న రాతిపై పాదములు నీటిలో తేలుచుండగా భరతుడు కూర్చునియున్నాడు. స్థిరదృష్టితో రాముని వనవాస కేశముల జూచు చున్నాడు.

ఆ స్థితిలో నున్న భర్తను మాండవి చూచినది. ఎంతో వేదనతో భర్త యొద్దకు వచ్చినది. ఆ సమయమున నామె వక్షముపై గల పైట చెంగు తడిసి, ఆ ప్రదేశము సౌందర్యమును వెల్లడించుచున్నది. వాన తగ్గి దానితో గాలియు శాంతించినది. దానితో పైట చెంగు తడియారి ఆ సౌందర్యమును మరల మరుగుపరచినది. భరతుడు తలయెత్తలేదు. వారిద్దరు శిల్పి చెక్కిన అందమైన విగ్రహముల వలెనున్నారు. మాండవీ హృదయ వ్యధచేత వెలువడిన నిట్టూర్పుల వేడి గాలులు భరతుని శరీరమును తాకినవి. దానితో భరతుని భావసమాధి భగ్నమై, చెంతనిలచి యున్న మాండవి వైపు తలయెత్తి చూచినాడు.

సిగ్గుతో తలవాల్చి వినయముగా దగ్గర నిలచియున్న మాండవిని జూచి నాడు. మనసంతయు రాముని గురించిన ఆలోచనలే నిండియున్నందున కొంచెము సేపటి కామెను గుర్తించ గలిగినాడు. “ఈమె కేకయరాజ పుత్రి కైకేయికి కోడలు’. వానికి చిత్రమగు నాశ్చర్యము కలిగినది. “మాండవీ! రాముడు వచ్చెనా? నన్ను పిలచుట కీసీమకు ఇటువంటి రాత్రి యెట్లు రాగలిగెను? ఆ పరంధాముడు, సీతతోను ప్రియసోదరుడు లక్ష్మణునితోను ఎచ్చట నున్నాడు? ఈ విధముగా ఈనాటికి నా కోరిక నీవలన తీరునట్లున్నది. త్వరగా నడువుము. ఆలస్యమెందుకు? మా అన్న చిక్కిపోయెనా? మా వదినె కూడ కృశించినదా? సర్వసంగములు వదలిన లక్ష్మణుడును సజీవుడుగా తిరిగి వచ్చెనా? ఈ విధముగా మన పుణ్యలతలు పూవులు పూచినట్లున్నవి.

'మాండవీ! నీ విక్కడికి ఎందుకు వచ్చినావు? నీవిటురాగా నచట నెవరున్నారు? రామచంద్రునకు పాద్యమిచ్చి గౌరవించ వలసిన దానవు. నీవిటు వచ్చుట బాగున్నదా? మాయన్న యేత్రోవను వచ్చినాడు? భరతుడీ గ్రామమున నున్నాడని తెలిసెనా? నేను మరణించితినని మాయన్న భావించలేదుకదా? మా వదినె నన్ను మరచిపోలేదు కదా? రాముని తమ్ముడు లక్ష్మణుడు నేనడవికి వెళ్లినపుడు నన్ను చంపజూచెను. వానికి నేను జ్ఞాపకముండను కదా! దయా సముద్రుడగు మాయన్న రాముడెప్పటికైన రాకమానడని, మాండవీ! నేను సర్వదా ఆశపడుచుందును.

అయోధ్యకు వచ్చిన రాముడిచటికిని వచ్చినచో నా మనసు పచ్చగా, హాయిగ నుండెడిది. నాకెందు కింతటి ఆశ? రాముడు జీవచ్ఛవమునైన నన్ను జూచుటకు వచ్చునా? అట్లు వచ్చియున్నచో నేదో యొక మచ్చ రాకుండునా? ఒక యనుభవమున్నది కదా? మాండవీ! రాముడు నన్ను జూచుట కిష్టపడకయే వేరొక మార్గమున పురప్రవేశము జేసియుండును. నా పాపమును నేను గుర్తించుకొనలేదు. రాముడు నన్ను క్షమింపడు. మాండవీ! నివు ముందు నడువుము, ముందు నా ముఖము కనిపించినచో వానిలో క్షమాగుణమణగి పోవచ్చును; కరుణించక పోవచ్చును.

'ఎట్లైనను జరుగనీ, ఆ ప్రభువు నన్ను చూచిన సరే! చూడకపోయినను సరే, నా మనసులోని బాధనిక ఎంతమాత్రము భరించలేను. వెళ్లి తీరెదను, స్వామి వాని పాదుకలు సమర్పించుకొని వాని పాదములపై బడి యేడ్చెదను. కాదని నన్ను త్రోసివేసిన యెడల మా వదినె సీతమ్మ స్వామిని ప్రార్థించి శాంతింప జేయక ఊరకొనదు – ఇది స్వామి యసహ్యించుకొను బ్రతుకు. జానకీ దేవికైనను జ్ఞాపకము రాకపోవచ్చును. లక్ష్మణుడు కలలో నైనను చూచుట కిష్టపడని ముఖము. లోకులందురు నసహ్యించుకొని పెడముఖము పెట్టుకొని వెళ్లే బ్రతుకు. మాండవీ! నావంటి వాడీ భూమిలో నేనాడును పుట్టకూడదు.

‘రాముడెక్కడ? నేనెక్కడ? అతడు ప్రేమతో చూడరావలెనని కోరగలవాడనా? అతనితో పంతము నాకు జెల్లునా? నేనే ముందుగా స్వామి దర్శనమునకు వెళ్లెదను మాండవీ! నాకు మార్గమేమియు కనిపించుట లేదు. నీవు దారి చూపుము. అట్లే నిలబడి కదులవేమి? ఇదేమి? కన్నీరా? ముఖము త్రిప్పుకొనుట యెందుకు? ఇటు చూడుము, నీ బాధ యేమి? ఆ నిట్టూర్పులేమి? అయ్యో! చెక్కిళ్లపై కన్నీటి చారికలా? నేను వినదగినదైన నాతో జెప్పుము. మాట్లాడవేమి? ఆగుము, చెప్పవద్దు, ఆహా! అవి యా విశేషములు!

‘ఇక చాలును. మాండవీ! నీ మనసు అర్థమైనది. నావలన నీ మనసుకు తీవ్రమైన దుఃఖము కలిగినది. దానితో వెదకికొనుచు నిచటికి వచ్చితివి. సరే! నీవు వెళ్లుము. నేనీ సరయూ నదీ కెరటములలో స్నానమాడి నా మనస్సులోని అగ్నిని చల్లార్చుకొందును. నీ మనసు నాకు దెలిసినది. అందులో నీకు వ్యామోహము కలిగినదే అనుకొనుము. నా దృఢ చిత్తము నీకు తెలిసినదే కదా! ఈ నది యొద్దకెందుకు వచ్చితివి? ప్రాపంచికమైన కోరికలకు మూలమేదైన నీ మదిలో నాటుకొనినదా? ఇక వెళ్లుము.

ఇంత వాన భోరున కురిసినది. ఇచటికి వచ్చుటెంతో శ్రమతో సాధ్యమైనది. వీటిని లెక్కించక సీతారామ లక్ష్మణుల గురించిన యమృతము వంటి సమాచారమేదో చెప్పదలచి వచ్చితివనుకొంటిని. ఛీ! అది కాదని ఏ ముఖముతో నిచట నిలబడి యున్నావు? ఛీ! నీవు చండికవు. దారుణముగా ప్రవహించుచున్న ఈ నది వద్దకు నీవొక్కతెవే వచ్చి నీ విశాలనేత్రములు మరింత పెద్దవిగ జేసి నీ వయ్యారములు ప్రదర్శించి నా ధైర్య చిత్తమును కరిగించదలచితివి. ఇది యంతయు నా కేకయు రాజపుత్రి నీకు జెప్పి పంపియుండును, కాదందువా?

కానిచో నీ వెన్నడైన నర్ధరాత్రిలో నీ విధముగా ప్రయాణము జేసితివా? నీ మనసులో జెడు బుద్ధి పుట్టినది. నీ స్త్రీ బుద్ధిలోనికి నన్నును లాగుటకు వచ్చితివి. మాండవీ! ఇక చాలించుము. అబ్బ! ఏమి నీ పాతివ్రత్యము! నీ ముఖము

జూచుటకంటె విషము త్రాగుట మంచిది. రాముని చూడనిదే నా ప్రాణము నిలువదు. ఆ రామచంద్రునికి నాపై గల ప్రేమ పోయియుండును. నేనాయనను బ్రతిమాలినప్పుడే నాపై వాత్సల్యము పోలేదు కదా! ఆ రాముడీ రాజ్యములో కాలుమోపునా?

'ఇక నే జీవించి ప్రయోజన మేమున్నది? రాముని వనవాసపు గడువు పదునాల్గవ సంవత్సరములో సగము గడచిపోయినది. సీత నరణ్యావాస మంపిన నేనెంత పాపిని? నాకీ శరీర మెందుకు? దీనిని వదలుటయే ఉత్తమము. మాండవీ! నీవే చెప్పుము. నా పాప జీవితమును సరయూనదిలో దూకి ముగించుట ఉత్తమము కాదా? కాని రామప్రభువు నాతో 'భరతా! పదునాలుగు సంవత్సరములు ముగిసిన వెంటనే క్షణమైన నాలస్యము జేయక నీయొద్దకు వచ్చి వ్రాలుదు'నని అభయమిచ్చినాడు కదా! అందుచే నేమియు చేయలేక ఈ నదియొద్ద కూర్చుండి యున్నాను.

"మాండవీ! నేను నిన్నన్న మాటలకు పాపము! తీవ్రతాపము కలిగి యుండును. అందుచేత నిట్లున్నావా? నీ కటువంటి పాపపు కోరిక పుట్టి యుండని యెడల నిన్ను క్షమించుచున్నాను. ఇది రామ పాదములపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. త్రాగిన విషము వలె రాముని యరణ్యావాసము మహా తీవ్రమైన తాపమును, వేదనను కలిగించుచున్నది. రాత్రింబవళ్లు నాకేది గతి? ఎక్కడకు వెళ్లుదును! ప్రాణములు విడతునా? రామాజ్ఞను మీరదగునా? వంటి ఆలోచనలతో సర్వము నయోమయముగా నున్నది. నేనేమి చేయవలెను?

'కోపముచే గలిగిన బాధవలన లక్ష్మణుడప్పుడే నన్ను జంపజూచెను. కాని రాముడు నన్ను రక్షించినాడు. అట్లు చేసి యుండనిచో నాకీ విషమ సమస్య లెదురై యుండెడివి కావు. ఆనాడు నన్ను కాపాడుట ద్వారా నాకా రాముడి యాత్మహత్యా రూపమైన చావు కల్పించి, లోకులందరు ఛీ! యనునట్లుగా జేసినాడు. నేనే మాత్రము నా మనోవేదన నార్పజాలకున్నాను. నా తల్లి మా

కుటుంబ జీవనములో పాషాణ విషము కలిపినది. ఎన్ని జన్మలెత్తినను ఈ మచ్చ మాసిపోదు కదా! ఇక బ్రతుకెందుకు? దీని వలన నేమి ఫలము? రాముని రాజ్యమునకు గానివానిగా జేసితిని. ఇది యే విధమైన పూర్వజన్మ కర్మఫలమో కదా!

'మా వంశపు వాడైన భగీరథ చక్రవర్తి పవిత్ర గంగానదిని భూమికి దెచ్చినాడు. మా వంశకర్త రఘుమహారాజు – వరతంతు మహర్షి శిష్యుడు కోరిన ధనమిచ్చి కీర్తి నందినాడు. అటువంటి మహాత్ములు పుట్టిన వంశమిది. దానిలో, మాండవి! ఈ విషాగ్ని రగిలించితిని. సాయంకాలమైనంతనే సంతోషించు కువలయ పక్షిని మించిన నీలకాంతితో ముద్దులు మూటగట్టుచు నుండెడి శ్రీరాముని శరీరము, అడవిలో తిరుగుచుండునపుడు మొద్దులు, మ్రోళ్లు, ముండ్లతీగలు, రాళ్లు తగిలి యెంత కందిపోయి యుండునో కదా! ఆహా! భోగముల ననుభవించవలసిన రాజు అడవిపాలై శ్రమలు పడుచున్నాడు. 'హంసతూలికా తల్పమున పరుండవలసిన సద్గుణముల రాశి రాముడు నా మూలమున దర్భలు పరచిన నేలపై పరుండవలసి వచ్చినది. నేను చేసిన పూజల ఫలము వికృతముగా నున్నది. ఏ జన్మలో చేసిన చెడుకర్మల ఫలితమో? కైక కుమారుడనై పుట్టితిని. రాముని వనవాస దుఃఖమును ఈ నీచ భరతుడు కాక మరెవ్వరును చూచి సహింపలేరు. మాయన్న శత్రుమర్దనుడు. మారీచు నెక్కడనో దూరముగా సముద్రములో విసరివైచినాడు. నేను మారీచుని కన్న పాపాత్ముడను. రాముడు నన్ను జంపినను పాపము లేదు. ఐనను దయామయు డగుట వలన రాముడట్లు చేయక నాయందు కృపజూపుచున్నాడు.

నేను భ్రాతృ ద్రోహినే కాదు, పితృ ద్రోహిని కూడా. నా తండ్రి యెన్ని నోములోనోచి, పలుదినము లుపవాసములతో గడపి, ఎన్నెన్నో దానములు ధర్మకార్యములు చేసి, యజ్ఞములు చేసి , తపస్సుతో శరీరము కృశింప జేసుకొని దయాసముద్రుడు నిరంతరము కిరీటాది యాభరణములతో ప్రకాశించువాడు

నగు రాముని పొందెను. అటువంటి నా తండ్రి రామునికై పలువరించి మృతి జెందెను. దీనికి కారణము నేనే కదా!' వీడు తల్లిని జంపెను, పాపి యని రాముడు నన్నంగీకరింపడేమోయని ఊరకొన్నాను. లేనిచో మా గృహమును సర్వ నాశనము జేసిన దుష్టురాలగు కైక గొంతును తీగను కోసినట్లు కోసి పారవేసినను, మాండవీ! దానిని పాపమనరాదు కదా!

'శ్రీరాముడెక్కడ, ఈ భరతుడెక్కడ? అంతటి వానికి వీడు తమ్ముడుగా నుండు యోగ్యత గలవాడేనా? నా జీవితమునకు కలిగిన మచ్చ నాతడెట్లు భరించగలడు? మాయన్న రామన్న చక్కనివాడు. వాని ముఖము చంద్రబింబమే. ఆ చంద్రునికి మచ్చవలె రామునకీ భరతుడు తమ్ముడను మచ్చ కలిగినది. వీడా రాము నొక యోగిగా చేసివేసినాడు. వీడు తమ్మునిగా నుండ తగినవాడేనా? చెప్పుము. రామునకు నేను తమ్ముడ నన్నచో ప్రజలు విని సహించెదరా? మాండవీ! తెగిన గాయముపై నా తల్లి కారము చల్లినది. తండ్రి యా బాధ సహించలేక స్వర్గ నివాసము జేయ వెళ్లినాడు. అన్న యడవుల బట్టి పోయినాడు. సన్యాసి ప్రేమానుబంధములు త్రెంచుకొనును. వాని హృదయ మీ విషయము లందు రాతివలె కఠినముగా నుండును. బ్రహ్మ నా హృదయమును కూడ రాతితో నిర్మించి యుండును. కానిచో నీ సంఘటన లన్నియు దాని నీవరకే బ్రద్దలు చేసి యుండెడివి.

'మాండవీ! భర్తను జంపిన మహారాక్షసి కైక. ఆమె గర్భమున పదినెల లెట్లు గడపితినో? ఆ చండికకు పుత్రకామేష్టి యజ్ఞము ద్వారా లభించిన దివ్య పాయసము నిచ్చి, నా జన్మకారకుడై నా తండ్రి నాకీ మచ్చ దెచ్చినాడు. నేను పూర్వము చేసిన కర్మఫల మిటువంటిదై యుండును. దీనిని భరించుట కంటె నాకు వేరే గతి యేమున్నది? నా తండ్రి స్త్రీ వ్యామోహమును మెడకు దగిలించుకొన్నాడు. అది వానిని కాటు వేసినది, దానితో మరణించినాడు. పాము విషము కాటందిన వానిని మాత్రము చంపును. కాని ఈ సర్పవిషము

హితులందరిని చచ్చునట్లు చేసినది. ఆమె పదునైన కత్తివంటిది. దానిపై భార్యయను తేనె పూసినది. కత్తి తన పనిని నెరవేర్చినది కదా!

'సుకుమార శరీరముపై చక్కని శ్రేష్ఠమైన పట్టువస్త్రములు ధరించు రాఘవుడు కైకమూలముగా నారచీర లెట్లు ధరించెనో కదా! ఆశ్చర్యము! స్త్రీ యొకప్పుడు కఠినమైన కత్తిగా నుండును, మరియొకప్పుడు పూవువలె మెత్తదనము జూపును. మాండవీ! శంబరాసురునితో జరిగిన యుద్ధములో శత్రువుల ఆయుధపు దెబ్బలచే మా తండ్రి మూర్ఛనంది రథ చక్రముల ముందుపడెనట. అప్పుడు కైక వాని నొక ప్రక్కకు లాగి యతనిని రక్షించెనట. ఆ సంబరము నాపుకొనలేక మా తండ్రి యామెకు వరముల నిచ్చెనట. ఈ శంబర మాయలేమో? అయ్యో! శ్రీరాముడు తెలుసుకొనడయ్యెను!

'వరమిచ్చిన దెప్పుడు? దానికి సాక్షియెవరు? ఏనాటి వరములనో ఈనాడు కోరుట యేమి? అని ఒకడైనను నిలదీసినాడు కాదు. ఇది న్యాయమా? అని యెవడును నిలదీయలేదు. నే నయోధ్యలో కాలు మోపలేను. మా తండ్రి మాత్రమేమి తక్కువ తినెనా? ఆనాడు విశ్వామిత్రుడు వచ్చి యడిగి నంతనే రామునడవుల కంపినాడు. నేడు మరల కైకమాటపై వనముల కంపినాడు. పట్టుమని పదినాళ్లైనను సుఖముగా నుండనిచ్చిన దెప్పుడు?

'సుఖముల యందలి కోరికతో భార్య మాటను కాదనలేక రాజు మాయన్న నడవులకు వెళ్ళుమని యుండును. మా సోదరుడు లక్ష్మణుడు నన్ను జంపుటకు నాపై విల్లెత్తినాడు. కాని దానిని భర్త ప్రాణముల దీసిన పాపిష్ఠురాలా కైకపై మాత్రము వదలలేదు. తండ్రి బుద్ధి ముసలితనము వలన పెడత్రోవ బట్టియుండ వచ్చును. దుర్బుద్ధితో కైక రామ వనవాసము కోరియుండ వచ్చును. మంచి మనసు కలవాడు మా భరతుడిచట లేడు. అతడు వచ్చువరకు నేనడవికి కదలి వెళ్లనని అయ్యో మాండవీ! మాయన్న రామస్వామి యనకపోయెను గదా!

'లోకములను తగులబెట్టగల సామర్థ్యమొక్కొక్క యాడుదాని యందుండును. భర్త యెంత ప్రసిద్ధుడైనను, కొడుకెంత తిన్ననివాడైనను, దాని వలన నెవరి ప్రాణములు పోయినను – అట్టి యాడుది తన పంతమును తీర్చుకొని తీరును. అయ్యో! ఆ విధమైన మచ్చ మా సూర్యవంశమున కీనాటి కీకైక మూలమున వచ్చిపడినది. కైకయను రక్కసి వలన రాముడడవికి వెళ్లెననగా కీర్తివంతులైన వారికింతకు మించిన అవమాన మేముండును? సాటి రాజులందరు నిది విని ఫక్కున నవ్విపోరా? ఆ కైక కొక్కడైన తగిన జవాబు చెప్పలేకపోయెనే! ఆశ్చర్యము!

'ఆ కైక గుండెల దీయగల బంటు. గుండెయేలేని యాడుది. ఎందరి నోళ్లు నొక్కియుంచినది! కులగురువు, మహాఋషి వశిష్ఠుని మాట త్రోసివేసినది. ఎంత గోల పెట్టినను వాని మాటకు విలువ లేకుండ జేసినది. అది నెగ్గలేదు. పౌరులేడ్చి మొత్తుకొనిరి. వాటిని త్రిప్పికొట్టినది. ఇది యంతయు జూడగా నామె రాక్షస జాతికి చెందినదా? అనిపించుచున్నది. మాండవీ! రాజ్య సంపదలపై ఆశలలో చిక్కుకొని, కీర్తిని కాదని, నిక్షేపము వంటి రామభద్రుని అడవులకంపిన పాపాత్మురాలామె. ఈ సంసారమీ విధముగా కాలిపోవుటకు కారణమామెయే. ఎవరెన్ని శాపములు పెట్టినను పాపి చిరాయువు కలిగి యుండుననుట లోకపు వాడుకయే కదా!

'రాముడు అడవులకు వెళ్లు త్రోవలో గంగాతీరమున తమ్ముడు లక్ష్మణునితో గలసి జడలు ధరించెనట. గుహు దర్పించిన కందమూలములైనను తినక, నీరు మాత్రమే ఆహారముగా తీసుకొని, ఇంగుదీ వృక్షపు మొదట దర్భలు పరచిన పడకపై నిద్రించెనట. ఎంతటి బాధాకరమైన వార్త! దర్భలపై పరుండు టెంత కష్టము! పూవు వలె మెత్తని శరీరము కల జానకీదేవి శరీరమా రాత్రి తెలవారు వరకు నా దర్భలపై యెట్లుండ గలిగెనో? లక్ష్మణా! వారి కట్టి పడక నెట్లమర్చ గలిగితివి? మొత్తము మీద లక్ష్మణుడు జ్ఞాని యనిపించినాడు. వాని మనసెంత పాషాణమో కదా!

'లక్ష్మణా! అడవిలో లేడిపిల్లలు కొరికి విడిచినందున మోడులై యున్న దర్భలను స్వామికి పాన్పుగా నమర్చిన నీ శేషత్వమేమోకదా! ఇపుడు నా కర్థమగుచున్నది. సీతారాములను వెన్నంటి నీవు వెళ్లినావనగా వారికి సుఖములు చేకూర్చగలవని భ్రమపడితిని. జ్ఞాతిభయమను మాట వినుచుందుము. దాని యర్థమిదే కావచ్చును. లోకములో పువ్వులతి సుకుమారములందురు. వానిని కూడ మోటనిపించగల సౌకుమార్యముగల మా వదినె సీతమ్మకు ఇటువంటి శయ్య నేర్పరచితివా? ఔరా! లక్ష్మణా! శేషత నీకు దగి యున్నది. అందుచేతనే మాయన్న స్నేహితుడైన గుహుడు రాత్రియంతయు నీ వెనుకనే జాగ్రత్తగా కని పెట్టి యున్నాడు.

'నీవు జ్ఞాతివి. సీతారాములు నిద్రించుచున్నారు కదా! యని ఏ సమయములో నే యపకారమా రాత్రి సమయమున జేయుదువో యనియే గుహుడు బాణముల చేబట్టి నీడవలె నిన్నంటి కనిపెట్టియున్నాడు. లక్ష్మణా! నీవిధముగా నపకీర్తి భరించితివి. ఔరా! ఏమి సేవ చేసితివి! నీ విశ్వరూపము శేషతయని విశదమగుచునే యున్నది. నీ వృత్తిలో శేషత, మాటలో శేషత, రూపముచే శేషత, భోగము వదలినను శేషత – ఇట్లా రాముని వద్ద నీ శేషతను నిర్వహించుచున్నావు. వీటినన్నిటిని చూడగా శేషత ముందుపుట్టి ఆ పిమ్మటనే నీవు పుట్టినట్లున్నావు. దర్భలతో గదా రామునికి శయ్యనమర్చితివి! ఆ కుశలను పాముపుట్ట నుండి కోసి తెచ్చితివా? ఇందేదో రహస్యము లేదుకదా! అన్న యనగా తండ్రితో సమానము. రామునే దశరథునిగా భావించి మంచి మార్గమునకు వచ్చుట యోగ్యముగా నుండును. నీ ముఖము నింతగా జూపుచున్నావు. లక్ష్మణా! భోగిగానుండు కోరిక కలిగినదా?

కుండలి (పాము, వ్యాకరణ భాష్యము వ్రాసిన పతంజలి మహర్షి) వైనావా? ఇక వ్యాకరణ భాష్యము కూడా చెప్పి భూమండలిపై ప్రసిద్ధినందెదవా? మా సీతారాములు పరుండుటకు దర్భల బరచి నీ వంకర నడతను వెల్లడించినావు.

ఎంతగా విద్యలు నేర్చినను నీ విషమ స్వభావము విడువకున్నావు (కుండలి, మండలి, వంకర నడత, భాష్యము జెప్పుట, విషమ స్వభావము – ఈ పదములన్నియు లక్ష్మణుడు ఆదిశేషుని యవతారమని తెలుపుచున్నవి)

'అయ్యో! అ లక్ష్మణా! నీ చర్యల యర్థముల గ్రహించలేక ఇన్ని మాటలంటిని. పాడుదర్భలతో పాన్పు నమర్చినా వన్నందుకు కోపము వచ్చినదా నాపై బుసలు కొట్టుచున్నావు! నీ బాణములతో నా తల ముక్కలుగా పగులగొట్టుము. సోదరా! పాపీ చిరాయువన్న సామెత యున్నది కదా! నా తల యెందుకు బ్రద్దలగును? సోదరా! శ్రీరామ సేవ జేయుటకు భార్యను, తల్లిని, తండ్రిని, సంసారమును – సర్వము వదలిన ధన్యుడవు. నీ వంటి సోదరుడు నాకెట్లు దొరకును? నా బంగారు తండ్రీ! నీదేమి కర్మమో, కాని సుఖముగా నింటి యొద్దనే భోగము లనుభవించుచు నుండక, చెట్లు పుట్టలు పట్టుకొని తిరుగుచున్నావు కదా!

'లక్ష్మణా! నీ వడవులకు ప్రయాణ మగునప్పుడు శ్రీరామునే దశరథుని గాను, సీతమ్మనే తనవలెను (తల్లిగా) మన్నించుచు నుండుమని సుమిత్రాదేవి చెప్పినదట కదా! దానికి దోడు నీ చల్లని శేషత్వముతో నరణ్యమునే అయోధ్యగా భావించుచున్న ధన్యుడవు. భళా! లక్ష్మణా! అన్న శ్రీరామునను సరించి ప్రాకుదునను పగబట్టి యున్నావా? నీ నడవడి బహు గోప్యమైనది. ఇప్పటి కిట్లే యుండి మా రామభద్రుని భోగమందనురక్తి కలవానిగా జేయ జూచుచున్నావా? నీతో నీ భార్య కూడ అడవులకు వచ్చియున్నచో నేనీవిధముగ అనగలిగి యుండెడు వాడనుకాదు.

'నాయనా! లక్ష్మణా! నిన్నేదో అన్నట్లు భావించకుము. విషము బెట్టి చంపువానికి జాలియనునది యుండదు. అట్టి క్రూరునికి దప్ప మరెవరికైనను ఊర్మిళ స్థితి జూచినచో సహనము నశించును. గౌరవముగా తలయెత్తుకొని తిరుగువాడెవడైనను సహనము కోల్పోవును. ఆ యిల్లాలు నిన్ను గురించి పడుచున్న వేదన తెలియుటచే నిట్లనుచుంటిని. పాము విషము నశింప జేయుటకై

దానికి పాలుపోయుట దండుగ. ఊర్మిళను నీచేత బెట్టుటయు వ్యర్ధముగానే ఉన్నది. నీయందు విషమున్నదని పాపమా సుకుమారికి దెలిసియుండదు. ఆమెను వెంటబెట్టుకొని వెళ్లుట నీకు గాయముగా తోచెనా?

లక్ష్మణా! నీకొరకేడ్చి యేడ్చి యామె ముఖము వాచిపోయినది. జానకి భర్తతో సల్లాపము లాడుచు నడవికి వెళ్లినది. ఈ కైకమ్మ కోడలును భర్తతోనే ఉన్నది. నీ మరదలు శ్రుతకీర్తికిని భర్త దగ్గరనే యున్నాడు. పాపమా యూర్మిళ ముఖమున బ్రహ్మదేవుడు భర్తతో కూడియుండు సౌభాగ్యమును వ్రాసి వంచించినాడు. నీవు పాడుబుద్ధితో నేవో సుఖములు పొందగోరుచు నామెను దూరముగ నుంచితివని నేననుట లేదు. సుఖములున్నను, కష్టములున్నను, ఏ పుణ్య స్త్రీయైనను భర్త యొద్దనే ఉండగోరును. లక్ష్మణా! నీయందీ లోపమొకటే నాకు కనిపించుచున్నది. నేనేమి చేయగలను?

తమ్ముడా! సద్గుణ విరాజితుడవు - రాఘవుని సేవకై నాహారమును నిద్రను వదలివైచిన మహాత్ముడవు. నా బంగారు తండ్రీ! నిన్ను ముద్దాడ వలెనని ఉన్నది. ఏదీ తలయెత్తుము" అని భరతుడు తన యెదుట గల మాండవీ గడ్డము పైకెత్తి దొండపండు వంటి యామె క్రింది పెదవిని ముద్దిడబోగా, నామె కంగారుపడి "స్వామీ! ఇది మీ దాసురాలు మాండవి" యనుచు ప్రక్కకు తొలగిపోయినది. భరతుడును "మా తమ్ముడనుకొంటిని" అని దుఃఖముతో 'చండికా! ఇచటి కెప్పుడు వచ్చితివి? నన్ను భూతము వలె పట్టుకొన్నావు. ఇచటికి వచ్చినను నాకు శాంతి లేకుండ చేయుచున్నావు. ఇదేమి పాపమో కదా!

మెడకు రాయి గట్టుకొని ప్రాణము విడచెదను. అది కానిచో కొండపై నుండి క్రిందికి దుమికి చచ్చెదను. రాఘవుడిచటికి రాకపోయిన యెడల నేను మాత్ర మిచ్చట నిలువ లేను మాండవీ! నేను లేనని ఏడ్చువారెవరు? నేనిక నేమియు జెప్పజాలను. ఈ మనోవేదనకు మరణములతోనే శాంతి, నా కొరకై

యేద్వక, నీవీ గ్రామమునందే ఉండి, నాకు మారుగా మాయన్న పాదుకలను పూజించు చుండుము” అనగా మాండవి ‘హా’ యని పెద్దగా నరచుచు భర్త పాదములపై బడి అచటి నుండి లేవక ఏడ్చుచు..

‘మీ పాదములపై నొట్టు పెట్టెదను. యధార్థము తెలుసుకొనుడు. అర్ధ రాత్రియందు, తుపానులో మీరొక్కరే ఇచటికి వచ్చితిరి. నా మనోవేదన నాపలేక స్వామీ! నేనొంటరిగా పరుగెత్తి వచ్చితిని. ఈ దాసురాలు మీ హృదయవేదన శాంతింపజేయుటకు కొన్ని మాటలు మనవి చేయదలచినది. నాపై కోపము వచ్చినదా? నాతో భాషింప రాదా? నా మాటల వలన మీ దుఃఖము తగ్గి వేదన తీరునేమో? ఆలకించుడు.

“మీరిప్పటికే మీ యీ ఇల్లాలిపై దయామృతమును ప్రవహింప జేసినారు. నా పుణ్యలతలు పూలు పూచి కాయలు కాచినవి. మహాత్ముడగు శ్రీరామచంద్రుని పాదుకలను పూజించుచుండిన పవిత్రమైన మీ హస్తము నన్ను తాకినది. అదియే పదివేలు. ఇంకేమి కావలెను? నాపై కోపగించరను నమ్మికతో మీకొక విన్నపము చేసుకొనెదను. ప్రభువు రామచంద్రునిపై నొట్టు బెట్టి నన్ను క్షమించితినని చెప్పినారు. కనుక నా మాటలు విని వానిలో నేదైన సత్యమున్నదేమో పరిశీలించుడు.

ఏ వస్తువుపై ప్రేమయుండునో ఆ వస్తువు నందున్న అంతర్గత శక్తి గుర్తింప లేము – మాయన్న రాముడు రూపసంపదతో నొప్పువాడు, సర్వ సద్గుణములు కలవాడు నని చెప్పుకొని మురిసిపోవు చుందురు. అంతే, కాని ఆయనయందే మహిమ కలదో యొక్కరును గుర్తించరు. మీ తల్లి కైకమ్మ మహాయోగిని. దివ్యమైన చరిత్ర కలిగినది. అయినను లోకుల దృష్టిలో నామె లోభము కల నీచురాలిగా కనిపించుచున్నది. స్వామీ! ఒకవేళ నేను యధార్థము జెప్పినచో లోకులు గుర్తించి తమ యభిప్రాయములు మార్చుకొందురేమో? మీరు కూడ మీ మాత కైక స్వభావ మెట్టిదో విశదముగా గుర్తించ వచ్చును.

'రామునిపై ప్రాణములుంచి నీరు, ఆహారము మానుకొని యున్న మహాత్ములు మీరు. ఆ రామచంద్ర పరబ్రహ్మమును వదలి యొక నిమిషమైన నిలువలేనివారు. కాని రాముని శక్తిని గుర్తించియుండ లేదు. ఎందుచేత ననగా రామునిపై మీకు గల ప్రేమ దానికి అడ్డుగా నున్నది. ఆ రాముని మహాత్మ్యము దెలిసిన మీ కుల బ్రాహ్మణ తపస్వి వశిష్ఠుడేమి చేసెను? మీ తండ్రి రామునికి పట్టాభిషేకము జేయుటకు మంచి ముహూర్తము నిర్ణయించుమని కోరగా, రాముని సన్యాసిగా జేసి యడవులకు పంపు ముహూర్తము పెట్టెను.

మామ దశరథుడును, అత్త కౌసల్యయు – మా రాముడు, రఘురాముడు, నీలమేఘ శ్యాముడు నని పిలుచుచు రామునిపై నెంతో ప్రేమ జూపెడివారు. కాని రాముని శక్తి యేమో? వాని విలువ యెంతో? భూమిమీద నెందుకు పుట్టెనో, సంచరించుచుండెనో? తెలుసుకొన గలిగిరా? ఆ రామతత్వము నీ భూమిపై నిద్దరే పూర్తిగా గ్రహించగలిగిరి. అందు గాధి పుత్రుడు, మహా తపశ్శాలియునగు విశ్వామిత్రుడు మొదటివాడు కాగా, గత జన్మలో నార్జించిన మహాతపః ఫలముగా ఆత్మ విద్యా ప్రభావమును హృదయమందు నిలుపుకొన్న కేకయ రాజపుత్రి కైక రెండవది.

'ఎంత గొప్ప రత్నమైనను సాన బట్టనిదే ప్రకాశించదు. మనోజ్ఞమైన రాముడను రత్నమును గుర్తించి దానిని సానబట్టిన వానిగా కౌశికుడు లోకమున పేరొందినాడు. ఆ తరువాత కైక వలననే గదా నేడు రామచంద్ర పరబ్రహ్మ మహత్తను కల్పలత లోకమున విస్తరించుచున్నది! కైక మహాతపస్విని కనుక లోకములో నెక్కడను లేనంతటి గొప్ప మహత్తు రామునిలో నున్నదని గుర్తించినది. ఆ రాము నడవులకు మరలించు ప్రయత్నము జేసినది. ఆమె పంతమును సాకుగా తీసుకొని రాముడడవులకు బయలుదేరినాడు.

'లోకమునే మూకుడుతోను మూయలేము. లోకులు కాకులు వంటివారు. కైకమ్మను తిట్టిపోయుట వారి నిత్యకృత్యముగా మారినది. అది వారి సహజ

స్వభావమైపోయినది. మీరు నా ప్రత్యక్ష దైవము. మిమ్మేమియు ననరాదు. కాని ఆ లోకులతో మీరును చేరి మీ మాతృదేవతకు శాపనార్థములు పెట్టుచున్నారు. ఆమె యందే పాపము జూచినారు? మీకు కనిపించు చున్నదొక్కటే. అది యామె శ్రీరామ పట్టాభిషేకమును భంగము చేసి రామునడవుల కంపినది - అనుటయే కదా! కాని ఇందువలన నారామ దర్శనము చేసుకొని దానివలన నడవులలో నెందరో మహాఋషులు తమకోరికలు తీర్చుకొని తరించెదరో ఆలోచించినారా? ఇది రామ వనవాసమందలి పరమార్థమని ఎందరు గుర్తించెదరు?

మీరందరు నా రాముని పద్మములవంటి సుకుమార పాదములు రాయికి రప్పకు దగలి కందిపోవునని బాధపడుచున్నారు. కాని నీలమేఘశ్యాముడైన రాఘవుని మెత్తని పాదముల కంటుకొనిన మెత్తని ధూళి సోకియే కదా రాయి నాతిగా మారినది. మీ వంశప్రతిష్ఠ లోకములో చాటుటకీ కీర్తి చాలదా? రాముడు తాటక యను ఘోర రాక్షసిని చంపెను. ఇది సత్యమే కదా! మీ వంశ ప్రతిష్ఠను లోకములో ప్రతిష్ఠించుట కిది చాలదా? అడవులకు వెళ్లినను మీయన్న కేకీడును కలుగదు. మనము తెలుసుకొన లేకున్నను లోకమునకు శుభమే కలుగును.

లోకములకు మేలు చేయవలసిన వారు ఇంటిలోనే కూర్చుండి పోయినచో ఫలితమేమి యుండును? వారి జన్మ యందుకొరకు కాదుకదా! ఆ కౌశికుడు మీ యందరను కాదని, కను లెఱ్ఱజేసి, రాజును వణకించి, రాముని తనవెంట తీసుకొని వెళ్ళని యెడల సాధుజనులను బాధించు పాపి సుబాహుడు చచ్చియుండెడి వాడా? చిగురాకుల వంటి చేతులలో ధనుర్బాణములు ధరించి రాముడు మారీచుని సముద్ర మధ్యమునకు విసరివేసెను. అది తెలిసిన లోకము 'అహో! ఏమి యారాముని పరాక్రమమని పొగడినది. అది యేదో అద్భుతమైన దైవశక్తి యని మీకు దోచలేదా?

'మీ రాముని వెఱ్ఱివాడనుకొన్నారా? విశ్వామిత్రుని వెంట వెళ్లి అడవులలో

చేదుమ్రింగె ననుకొన్నారా? ఎరతో గాలము విసరి కదా చేపను పట్టుకొనుట! విశ్వామిత్రుని వెంట వెళ్లి యతని యాగరక్షణ జేసి - ఆకలిని దాహమును పోగొట్టు బలాతి బలలను విద్యలను, వానిని మించి యెన్నెన్నో మహాస్త్ర లాభమును పొందినాడు. ఎందరెందరో ఎత్తలేని శివుని విల్లు విరచినాడు - అయోనిజయైన సీతను క్రొత్త కోడలిగా నయోధ్యకు సగర్వముగా తీసుకొని వచ్చినాడు. ఇవి పరోక్ష లాభములే కదా!

కైక యంత యాగడము చేయబట్టియే - రాజు తలగొట్టుకొనినను, అంతఃపుర స్త్రీలందరు గోలపెట్టి యేడ్చినను, రాముడడవికి పోక తప్పలేదు. ఇది దుఃఖాంతమా? సుఖాంతమా? మహాశయా! మీరే చెప్పుడు. అరణ్యవాస చరిత్ర యంతయు పరిశీలించిన మీకే తెలియగలదు. సీతను పెండ్లాడి తిరిగివచ్చుచు రాముడు దారిలో పరశురాముని గెలిచినందున మీ తండ్రికి ఆనందమైనది. రాముని లోకాలను రక్షించుటకై పుట్టినవాడని అనక 'రామా! నా ప్రియపుత్రా! యని బిగ్గరగా ఎలుగెత్తి పిలచుట నిజమునకు వెఱ్ఱి వ్యామోహము కాదా!

కారడవులలో నెందరో మునులు, ఋషులు ప్రాణాయామపరులై ఊపిరులు బిగబట్టి కనులు పూర్తిగా మూయక రామునికై యెదురు చూచుచుండగా - మీ రారాముని వదులలేక దుఃఖమున మునిగి యున్నారు. అయినను సంహారము జేయక కోదండ రామునికి నిద్రపట్టునా? ఆనాడు కౌశికుడు డొకడే మీతండ్రి నెదిరించి రామునడవులకు తీసుకొని వెళ్లినాడు. ఆ తరువాత ఆడుది యైనను మీ యింట నందరిని ఎదిరించి కైక - సీతతో కూడ రాముని అడవులకు బంపినది. అదే జరిగి యుండని యెడల మీయన్న రామచంద్రుడెంత వ్యధ జెంది యుండెడి వాడో కదా!

కైకమ్మ యెంతో నిగ్రహము కల స్త్రీ. రామునిలో గల మంచి గుణములను గుర్తించగలదు. అందుచేతనే లోకు లెన్ని కారుకూతలు కూసినను వానిని

లక్ష్యపెట్టక శ్రీరామునడవులకు పంపినది. ఆహా! ఆమె దెంత ధీర హృదయము! అట్టి మాతనందురా? కైకకు శ్రీరామునిపై నేమాత్రమును ప్రేమ లేదని తెలియని వారు మాత్రమే అనగలరు, జ్ఞానవంతులు తప్పక గుర్తింప గలరు. కైకకు తనయందు గల ప్రేమాదరములు శ్రీరామునకు దెలియవా? నిజము నిలుకడ మీదనే కదా తెలియునది?

'తన సవతి తల్లి కైక తనకు జేసిన యుపకారము రాముని కామె యందుకల భక్తిని ఇనుమడింప జేసినది. కనుక మనమామెను దూషించి, అట్లు తిట్టితిమన్న అపకీర్తిని తలపై వేసుకొనుటే యగును. రామ తత్త్వము – అది బాగుగా తెలిసిన వశిష్ఠుని కంటె కైకకే పదిమందిలో విలువ నిచ్చినది. ఇది మీయన్న రాముని వెట్టి యందురా? ఆమె వలననే మీ వంశమంతయు పేరు పొందగలదు. ఆమె పేరే శాశ్వతము కాగలదు. ఆమె వలననే రాముడు కీర్తి సంపదలతో శోభించగలడు. రాముని యథార్థతత్త్వము తెలిసిన తల్లిని మీరు తిట్టదగదు.

'ఇక రాముడడవులలో కష్టపడుచున్నారందురా? దాని నాతడు విశ్వామిత్ర ముని చంద్రుని యాగరక్షణకు వెళ్లినప్పుడే నేర్చుకొనియున్నాడు. కనుక నిప్పుడు మీరేమియు దిగులుచెంద నక్కర లేదు. లక్ష్మణుడు అన్న శ్రేయము కోరువాడు. రామసేవలో గాలి పీల్చియైనను బ్రతుక గలవాడు. అటువంటి వానికి ఆకలియు నిద్రయు మరపునకు వచ్చును. ఇక పాపము సీత చిగురుటాకుల వంటి సుకుమార పాదములు ఘోరాటవులలోని రాళ్లు, ముళ్లపై మోపుట యందురా? ఆమె పుట్టినిల్లు భూమియే కదా! పుట్టినింట స్త్రీకి కష్టమైనను సుఖమే యనిపించు ననుట లోకములో వాడుకయే కదా!

మీ తండ్రి దశరథుడేడ్చి తలమోదుకొనినను రామా, వెళ్లకుమని వెంబడించి పరుగెత్తినను, రాముడు మునివేషము ధరించి భార్యయు దమ్ముడును వెంబడించి రాగా నడవులకు వెళ్లినది తన సవతి తల్లి కైక మాటపై గౌరవముంచియే. ఇది యామెను గౌరవించుట కాదా? సవతి తల్లిని రాముడంత గౌరవించుచుండగా, నట్టి గౌరవ స్థానమందున్న తల్లి నామె పుత్రుడు దూషించుట తగునా? ఆమె

యెట్టిదో తెలియక మీయన్న అడవిదారి పట్టెనందురా? రాముడు గౌరవించిన కైకను తిట్టిపోయుట, రామునే తిట్టినట్లగును కదా!

'ఇక వినుడు. ఆ రాముని కొరకు మీరు బెంగపెట్టుకొన నక్కరలేదు. మీ బెంగను వదలి పెట్టుట మంచిది. అంతేకాదు. మీ తల్లి కైకను తిట్టుటయు మానివేయుడు. జరిగిన వానినే మరల మరల త్రవ్వి తలకెత్తుకొనుట నిష్ఫలము. రాముడెట్లును అడవికి వెళ్లనే వెళ్లెను. అరణ్యవాస కాలమును పూర్తి కావచ్చుచుండగా నీ గతజల సేతుబంధనము ఎందుకు? మీరా రామచంద్రుని బంగారు పాదుకలనే సర్వముగా భావించుచు మిగిలిన వానినన్నిటిని మరచి పోవుట మంచిది. మీలో మీరు పడుచున్న వేదన చూడలేక, ఈ దాసి ధైర్యము చేసి తనకు తోచిన మాటల జెప్పినది. అందరు తలచునట్లు మీ తల్లి కైకమ్మకే లోభమును లేదు. లోకుల మాటలు లెక్కించకుడు. 'మాతృదేవోభవ' యను సూక్తిని పరిగణించి ఆమెను పూజించి గౌరవింపుడు. అందువలన మీరు, మీతోబాటు నేనును తరించగలము.

'భగవత్పారతంత్ర్యము మీకు సహజమైన గుణము. కనుక రామచంద్రుడు మీకేమని ఆజ్ఞాపించెనో దానికే మాత్రమును వ్యతిరేకముగా నడచుకొనరాదు. అది జరిగి తీరవలసినదే. అది ఎన్నటికి మారునదికాదు. అంతేకాదు. దాని నెవరు నేమాత్రము మార్చలేరు. అంతటి శక్తి యెవరికి కలదు? ఆ పాదుకలు మీకు ప్రసాదముగా లభించినవి. అంతే చాలును. మీ గుహుడు రాముడనిన ప్రాణము పెట్టువాడు. అంతటి భక్తుడు రాముని వదలి యుండలేదా? ఏ కారణమును లేకయే పనిబడిన యెడల మనకు ప్రేమగల వస్తువు దూరముగా నుండుటయే క్షేమము. దానివలన ప్రేమించిన వారా ప్రేమించిన వస్తువును సర్వకాలములందును సర్వ అవస్థలందును మనోనేత్రముతో చూచుచుండగలరు.

'గుహుడు రాముని ఎడబాటు నెట్లు భరించుచున్నాడు? గంగానదీ తీరము నందలి ఇసుక తిన్నెలపై కనుపించుచున్న రామపాదముల గుర్తులను చూచుచుండియే కదా! మీరచటికి వెళ్లి ఎపుడైనను పరిశీలించినారా? వానిని

చూచియే గుహుడు బొందిలో ప్రాణములు నిలుపుకొనుచున్నాడు. అతనికి ఆ విధముగా రామపాదములు ప్రసాదించ బడినవి. మీకో? రామప్రభువు బంగారు పాదుకల నిచ్చినాడు. రాము నాజ్ఞానుసారము రామపాదుకలే మీకు స్వామి ప్రసాదము. ఇక మీకంతయు నన్నియు పాదుకలే. కనుక దుఃఖించ నవసరము లేదు.

'ఎక్కడ శ్రీరామ దివ్యపాదముల ఆనవాళ్లు గంగానదీ తీరపు ఇసుక తిన్నెలనుండి గాలికి చెదరిపోవునో యని గుహుడా గుర్తులకడ నిరంతరము జాగరూకుడై కావలి గాయుచున్నాడు. వానికావిధముగా రాముని జ్ఞాపకపు గుర్తులు మిగిలియున్నవి. యభిమానమున్నను వానికి వేరేమియు ననుగ్రహింప బడలేదు. మీకో! ప్రాణములు విడతునని పంతము పట్టుటచేత పాదుకలు దానము జేసినాడు. ఈ దానము 'నీకు తరణోపాయము ఈ పాదుకలే' అని స్పష్టముగా జెప్పుట లేదా ?

'అన్ని విషయములు సమీక్షించుడు. ఇక మనకాపాదుకలే శరణు పొంద దగినవి. అవియే మనకు తారక మంత్రము. నిజమైన యోగము నభ్యసించువారు ప్రతిరోజు కొంచెము సేపైన నిద్రించెదరు. మీరా కొంచెము సేపును నిద్రపోవుటలేదు. ఇక మీరా పాదుకలను ధ్యానించుచుండినచో నవియే మీ చిత్తమునకు శాంతినిచ్చును. ఇవి స్వామి ప్రసాదమను స్థితికి మనము చేరుకొనినచో శ్రీరామచంద్ర ప్రభువు ప్రసన్నుడగును. పాదుకా సేవకు సమయమైనది, బయలుదేరుడు' అని పలికినది. వారిద్దరు రామపాదుకలున్న వైపుకు బయలుదేరిరి.

